ప్రేమ పవిత్రం! పురుషుని కోసం స్త్రీ చేసే త్యాగం అమూల్యం! అతని ఆశలను చిగురింప చేసే శక్తి ఒక స్త్రీకే ఉందేమో!

శ్రీ అన్నపూర్ణ సినీ ఎంటర్‌ప్రైజెస్

తప్పక చూడండి!

# ఆమెకథ

దర్శకత్వం: కె. రాఘవేంద్రరావు

నిర్మాత: క్రాంతికుమార్

[కృష్ణా, గుంటూరు, నెల్లూరు వెరైటీ పిక్చర్స్ * పశ్చిమ, తూర్పుగోదావరి జిల్లాలు: సర్వరాయ శ్రీ మల్లికార్జున ఫిలింస్. (రాజమండ్రి) శ్రీ విజయా ఫిలింస్ ద్వారా విడుదల]

వైజాగ్, శ్రీకాకుళం: శ్రీ పద్మా పిక్చర్స్, వైజాగ్ * చిత్తూరు: విజయనిర్మల పిక్చర్స్ * సీడెడ్: జయలక్ష్మి పిక్చర్స్ * NAVRANG

(నైజాం: శ్రీ వేంకటేశ్వర ఆర్ట్ పిక్చర్స్)

ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938 1972]
శుక్రవారం : 9 12-'77
పింగళనామ సం. కార్తీక బ. చతుర్దశి
సంపుటము 71 సంచిక 12
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
★
పోస్టులో ఏడాది చందా రు. 41-60
ఆరు మాసాలచందా రు. 20-80
విడిప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003


విషయానుక్రమణిక



కొత్తది!

# అమృతాంజన్ లిమిటెడ్‌వారి విశిష్ఠమైన

# ఆముదము

## శుద్ధిచేసినది. వాసనలేనిది.

అమృతాంజన్ ఆముదము
సుప్రసిద్ధ అమృతాంజన్ కంపెనీ వారి
మరో విశిష్ఠమైన ఉత్పత్తి.

అమృతాంజన్ ఆముదము






మూడు
సైజులలో
లభిస్తుంది:
50 మిలి
100 మిలి
200 మిలి

OBM 3270 TG

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక

20-1-'78 సంచిక సంక్రాంతి సంచికగా వెలువడుతుంది. రచయితలు చిత్రకారులు డిసెంబర్ నెల 20 లోగా పరిశీలనకి రచనలు పంపవచ్చును. సం.



## ఘోర విపత్తు

అన్నపూర్ణగా వాసికెక్కిన ఆంధ్ర కోస్తా జిల్లాలను నవంబర్ 19వాడు రెండు అంచులా ఒక చెంప పెను తుఫాన్‌గా మరొక చెంప దారుణ ఉప్పెనగా కబళించిన ప్రకృతి విలయ తాండవం, వేలాది జన నష్టాన్ని, కోట్ల రూపాయలమేరకు ఆస్తికి పంటలకి నష్టాన్ని - యిప్పటికో మరువలేని విధంగా - కలిగించి పోయింది. ఈ సంచిక అచ్చు అవుతూండగా యీ ఘోర విపత్తు సంభవించింది. ఈ ప్రాంతాలు పర్యటించిన మా ప్రతినిధి యిచ్చిన కన్నీటి గాథను అదనపు పేజీలుగా యిస్తున్నాము.

## ఉత్తరాలు

### రేడియో వార్తలు

ఈ మధ్యన ఢిల్లీనుండి ప్రసారమగుచున్న తెలుగు వార్తలు వింటూ ఉంటే ఎంతో బాధవేస్తున్నది. వార్తలు చదువు వారు తరచు మారుతున్నారు. చదవడము వింటూ ఉంటేకర్ణకఠోరముగా ఉంటున్నది. చాలా బాధ వేస్తున్నది. వార్తలు ప్రారంభమునుండి అయిపోవు వరకు మధ్యలో ఆపుట కూడా లేదు. చాలా తప్పులు దొర్లుచున్నవి ఈ మధ్యన వొకసారి వార్తలు చదువుచూ తప్పు చదివి అందులకుగాను సారీ అని సరిగా చదివినారు. తెలుగు వార్తలలో ఇంగ్లీషు పదాలు ఎంతో చొచ్చుకునీయును. కొన్ని సార్లు ఏ వార్తలు చదువుచున్నారో కూడా అర్థమగుట లేదు. కొన్ని సార్లు తప్పులు తొందరలో చదివి, వాటిని మరల సరిగా చదవక మిగిలినవి చదువుకొనుచూ పోతున్నారు. కావున దీనికి సంబంధించినవారు ఇటువంటి లోపాలు లేకుండా చేసి, శ్రోతలకు కష్టములేకుండా చేయవలసినదిగా కోరుచున్నాము.

[యువ్వన పాటకుడు] ఏ. హెచ్. చంద్, బనవాసి [కర్నూలు]







## నారాయణుడంటే

విష్ణుదేవుడికి సహస్రనామాలు ఉన్నవి. వెయ్యి పేర్లు మాత్రమే కాదు. అంతకు ఎక్కువగా కూడా ఉండవచ్చును అన్నిటి కంటె ప్రధానమైనదీ, ప్రథమమైనదీ "నారాయణ" అనే నామం. ఆ పేరు ఎందుకు వచ్చినదో, అనేకులు అనేక విధాలుగా చెప్తారు.

1. భగవంతుని సృష్టిలో నారమే – అంటె నీరమే - జలమే మొదటిది. దానిని అయనంగా – నివాసంగా చేసుకుని తర్వాతి కార్యకలాపాలు జరిపించినవాడు – నారాయణుడు.

2. నారమంటే నరుల యొక్క సమూహం, అయనం అంటే పొందించడం, జనులనందరినీ వారి వారి కర్మలను పొందేటట్లు చేసేవాడు కాబట్టి నారాయణుడనే పేరు వచ్చినదని కొందరంటారు.

3. 'అయ' ధాతువునకు తెలుసుకొనుట అని కూడా అర్థం. అందువల్ల జన సమూహాన్ని - జనుల స్థితిగతులను తెలుసుకొనేవాడు కాబట్టి నారాయణుడని పేరు వచ్చినదని కొందరి అభిప్రాయం.

4. నరుడంటే ఆత్మ. ఆ ఆత్మవల్ల పుట్టిన ఆకాశాదులైన కార్యాలకు స్థానంగా కలవాడు కాబట్టి నారాయణుడైనాడని కొందరు.

5. నరులకు ఆశ్రయమైనందున (అయనమంటే ఆశ్రయం కాబట్టి) నారాయణుడని చెప్పడం ఉన్నది.

6. 'నరాజ్జాతాని తత్త్వాని
నారాణీతి తతో విదుః,
తాన్యేవ చాయనం యస్య
తేన నారాయణః స్మృతః.'

నరునివల్ల – ఆత్మవల్ల కలిగిన తత్త్వాలు నారములని చెప్పబడుతున్నవి. అవి అయనంగా - స్థానంగా కలవాడు నారాయణుడని దీని అభిప్రాయం.

7. 'నారం సరోరుహం ప్రోక్తం
జగద్యోనిమయం పురా,
యస్య నాభేస్స ముత్పన్నం
సనారాయణ ఉచ్యతే.'

నారమంటే పద్మం. జగత్తునకంతటికీ అదే కారణమని ప్రసిద్ధం ఆ పద్మం శ్రీమన్నారాయణుని నాభి నుండే ఏర్పడినది కాబట్టి, అతనికి నారాయణుడనే పేరు వచ్చినదని ఈ శ్లోకంవల్ల తెలుస్తున్నది.

8. నారములంటే చరాచరాలయిన వస్తు. అవి అయనంగా కలవాడు నారాయణుడు.

ఈ విధంగా – ఎనిమిది విధాలుగా 'నారాయణ' పదానికి అర్థం చెప్పారు.

---

### రాగబంధం

రాగబంధం సీరియల్ బాగుందనడానికి మాకు సంకోచంలేదు. అందుకీ బాపు బొమ్మలు సగం కారణం, మా పత్రికలో బాపు ప్రకాశించడం అతని అభిమానులమైన మాకు ఎంతో ఆనందం కల్గించింది. చిన్న సింహావలోకనం పేరిట రవీంద్ర ప్రసాద్‌గారు వ్రాసిన లేఖ చదివాము. అతని సున్న అబ్జర్వేషన్‌ను మెచ్చుకోకుండా ఉండలేము. 28—10—77 సంచికలో జీవితమే మోసం కథ ఏమంత బాగాలేదు. వీరాజీగారు తిరిగి కలంతో విజృంభించాలని కోరుకొంటున్నాము.

కలికి సుధాకర్‌రెడ్డి, జి. దయాకర్‌రెడ్డి, సురేష్‌బాబు, [నెల్లూరు]

### ముచ్చటయిన కథలు

ఈ వార పత్రికలో (4—11—77) ముఖ్యంగా మమ్మల్ని ఆకట్టుకున్నవి. మీరు ప్రచురించిన మూడు ముచ్చటయిన కథలు. కథలన్నీ చాలా హ్యూమరస్‌గా వున్నాయి. అయితే వీరాజీగారి సామాన్యుని సణుగుడు తాజాకాలమ్ ఈ వార పత్రికలలో చోటు చేసుకోకపోవడం మాకు విచారాన్ని కలిగించింది. గడియారం వెంకట గోపాలకృష్ణ (జి. వి. జి.)గారి సినిమా శీర్షిక మమ్మల్ని ఎంతో ఆకట్టుకొంటూవుంది. ఇకపోతే ప్రశ్నావళి శీర్షిక... మీ వైఖరి చూస్తే మీరు రామలక్ష్మిగారి వాక్ధాటికి భయపడి ఆ శీర్షికను కొనసాగిస్తున్నారేమో అనిపిస్తుంది. మాయాజాలం మతికట్టు, సీరియల్సు బావున్నాయి.

డాక్టర్ టి. గిరినాద్, శ్రీమతి టి. ప్రభావతి, శ్రీమతి టి. శకుంతలాబాయ్ (పెక్కె, నంద్యాల)

### డ్రీమ్ గాళ్ ?

ఈ నాటి తెలుగు చిత్ర పరిశ్రమలో ప్రముఖ స్థానము పొంది తన నటనాచాతుర్యముతో తన అందచందాలతో డ్రీమ్‌గర్ల్ గా వెలుగుతున్న జయసుధగారి ముఖచిత్రం, మా అభిమాన ఆంధ్రసచిత్ర వార పత్రికకు ఎంతో శోభాయమంగా ఉంది.

ఆర్. ఆదామ్. జయసుధ ఫాన్స్ అసోసియేషన్ [కర్నూలు]

### కథలు

4—11—77 నాటి ఆంధ్ర సచిత్ర వారపత్రిక చాల బాగుంది. ముఖ్యంగా మీరు ప్రచురించిన మూడు కథలు ముచ్చటగా ఉన్నాయి. అందులో శ్రీ గుడిసేవ సుందర రామయ్యగారి కాక్ టెయిల్ బ్రహ్మాండంగా ఉంది.

అవ్వారి రామప్రసాద్ (విజయవాడ)

### మంచు దివ్వెలు

మధుర భావము లింపునింపగ
"మంచు దివ్వెలు" కైత గూర్చిన
కవితాశరధి! శ్రీ దాశరధి!
జయోఽస్తు! దిగ్విజయోఽస్తు!
—ప్రొఫెసర్ భారతి [సికింద్రాబాద్]



# అపస్వరాలు

ఎ.జె.రామారావు



**ఆసాయంత్రం క్లబ్‌లో చాలా కోలాహలంగా వుంది. రంగు రంగుల దీపాలు, వాటి వెలుగులో** మెరిసే పూలతోట. క్లబ్బు ఆవరణ అంతా స్వర్గధామంలా వుంది. రేడియో గది నుంచి సన్నని సంగీతం తోట లోను టెన్నిసుకోర్టు దగ్గర వినబడుతున్నది. టెన్నిసుకోర్టు చుట్టుపక్కల సభ్యులూ, ఇతర ఆహూతులూ, ఆటగాళ్ళకోసం ఆత్రుతగా ఎదురుచూస్తున్నారు. రెపరెపలాడే రంగు రంగుల చీరలతో, సువాసనలు, చిరునవ్వు వెన్నెలలు నలువైపులా వెదజల్లుతూ వనితలు తిరుగాడుతుంటే పూలతోటే తిరుగాడుతున్నట్లుంది. పురుషులు డ్రింకులూ, కాఫీలు, టీలు తాగుతూ సిగరెట్లు కాలుస్తూ గుంపులు గుంపులుగా నిల్చుని మాట్లాడుకుంటున్నారు.

క్లబ్ వార్షికోత్సవం సందర్భంగా ఏర్పాటు చేసిన టెన్నిస్ పోటీ ఇంకో అర గంటలో ప్రారంభంకానున్నది. ఆటగాళ్ళిద్దరూ రంగంలో ప్రవేశించారు.

వారిలో ఒకతను శ్రీనివాస్ అని క్లబ్ మెంబరే. అతని ప్రత్యర్థి సూర్యనారాయణ జిల్లాకంతకు పెద్ద ఆటగాడని పేరు మోసిన వ్యక్తి. రాజమండ్రి నుండి ఈ పోటీ నిమిత్తం వచ్చాడు.

ఆటకోసం ప్రేక్షకులు చాలా వుత్సాహంగా ఎదురుచూస్తున్నారు. కొందరు పెదవి విరిచి, "అబ్బే, శ్రీనివాస్‌కీ సూర్యనారాయణకీ పోటీ ఏమిటండీ? సూర్యనారాయణకిది నల్లేరుమీద బండిలా వుంటుంది." అంటున్నారు.

"ఉజ్జీ సరిగా లేదనుకోండి. అయినా సూర్యనారాయణ ఆట చూద్దాం, కూర్చోండి," అని కొందరు పెద్దలు లేవడానికి తయారైన తమ పక్కవారిని కూర్చోబెడుతున్నారు.

కరతాళ ధ్వనులమధ్య ఆట మొదలైంది. శ్రీనివాస్ మొదట్లో ప్రత్యర్థి సర్వీసు ధాటికి జంకినట్లు కనిపించినా, నెమ్మదిగా పుంజుకుని అతనితో సమాన స్థాయి నందుకున్నాడు. ముందువరుసలో కూర్చున్న యువతుల నుండి అతనికి చాలా ప్రోత్సాహం లభించింది. వారిలో ఒకరిద్దరు అతని ఆటకు పదే పదే చప్పట్లు కొట్టి అభినందించడంతో అతడు వెయ్యి ఏనుగుల బలం వచ్చినట్లు విజృంభించి మొదటి సెట్టు అవలీలగా గెల్చుకున్నాడు. ప్రేక్షకులు ముక్కున వేలువేసుకున్నారు. అందరి ముఖాలూ ఆశ్చర్యార్థకాలు తగిలించుకున్నాయి.

సూర్యనారాయణ అలసిపోయాడు. కాని శ్రీనివాస్ అప్పుడే రంగంలో కొచ్చినంత తేటగా, వుత్సాహంగా వున్నాడు.

రంగు రంగుల ఇంద్రధనస్సు లాంటి ఆ

మొదటి వరుసకేసి అతడుచూసే ఒక్కొక్క చూపూ ఒక్కొక్క విటమిన్ ఇంజక్షన్‌లా పనిచేసి అతని బలోత్సాహాలు ఇనుమడింపచేసాగాయి.

ప్రేక్షకులు ఆశ్చర్యం నుండి తేరుకునే లోగా ప్రత్యర్థిని స్ట్రెయిట్ సెట్స్‌లో ఓడించి, కరచాలనంచేసి కోర్టుదాటి ఇంద్రధనస్సు వైపు నడిచాడు.

"మీరు అద్భుతంగా ఆడారండీ" వీణ మీటినట్లు, కిన్నెరలు మోగినట్లు, పుష్పవర్షం కురిసినట్లు అనిపించింది శ్రీనివాస్‌కు.

ఆ కలకంఠిని చూడగానే అతని హృదయంలో పెద్ద ఆర్కెస్ట్రాయే మొదలైంది.

"థాంక్స్. మీ అభినందనకి కృతజ్ఞుణ్ణి. మీ దగ్గిర కొద్దిగా కాఫీ వుంటే ఇంకా ఋణపడి వుంటాను" అన్నాడు శ్రీనివాస్ ఆమె ఫ్లాస్క్‌వైపు ఆశగా చూస్తూ.

"ఓ, మీకు కావలసినంత కాఫీ ఇస్తాను" అని కప్పులో పోసి అందించేలోగానే అతన్ని అభినందించడానికి తండోప తండాలుగా జనం రాసాగారు. కప్పు అందుకుని, "ఈ తంతు పూర్తవగానే కలుసుకుంటాను.

క్షమించండి'' అంటూ ఆ జన సందోహాన్ని సమీపించాడు శ్రీనివాస్.

అతడు తప్పక వోడిపోతాడని ఎదురు చూసిన పెద్దలు శ్రీనివాస్ అపూర్వమైన ఆట ఆడాడనీ, ఎన్నడూ అటువంటి ఆట తాము చూడలేదనీ, తామంతా ఆనందం తోను, గర్వంతోను తల మునకలవుతున్నా మనీ కొనియాడసాగారు.

జనం పల్చబడగానే 'నెమ్మదిగా తోట లోనికి నడిచాడు శ్రీనివాస్. అక్కడ ఒక టేబిల్ దగ్గర కూర్చుని వున్నది అతనికి కాఫీ ఇచ్చిన సుందరాంగి. ఆమె పక్క ఫుల్ సూట్‌లో వున్న ఏభై ఏళ్ల పెద్ద మనిషి ఒకాయన కూర్చుని వున్నాడు.

చిరునవ్వుతో, అతన్ని కూర్చోమంటూ, తండ్రికి పరిచయం చేసింది.

వాళ్లది మైసూరు. ఆయనకు కాల్—టెక్స్‌లో పని. పేరు బసవలింగప్ప. ఆమె మద్రాసులో ఎం. ఏ. పరీక్ష వ్రాసి వేసవి సెలవులకు విశాఖ వచ్చింది. పేరు రమణి.

''ఆహా! ఎంత రమణీయమైన పేరు!'. అనుకున్నాడు శ్రీనివాస్.

శ్రీనివాస్ తాను ఎం. ఏ. పాసయి ఐ. ఏ. ఎస్. పరీక్షకు చదువుతున్నానని టూకీగా చెప్పడంతో పరిచయాలు పూర్తయాయి. బోయ్ తెచ్చిన సాఫ్ట్ డ్రింకులు తాగుతూ ఎంతో స్నేహమున్న వాళ్లలా కబుర్లలో పడిపోయారు.

*        *        *

శ్రీనివాస్ సంపన్నుల బిడ్డ. కాకినాడ సమీపంలోవున్న ఒక చిన్న గ్రామంలో పెద్ద వ్యవసాయం వుంది అతని తండ్రికి. విద్యా గంధమెరుగని తమ వంశంలో ఇంత విద్య వచ్చిన కొడుకుని చూసుకుని మురిసిపోతూ వుంటారతని తల్లితండ్రులు. చిన్నతనం నుంచీ ఎంతో గారాబంగా పెరిగిన శ్రీనివాస్ ఒక విధమైన స్వేచ్ఛకు అలవాటు పడ్డాడు.

స్వగ్రామంలో హైస్కూలు చదువు పూర్తిచేసిన శ్రీనివాస్‌కి కాకినాడ పి. ఆర్, కాలేజీలో చేరిన మొదటి రోజు ఒక కొత్త ప్రపంచంలో అడుగు పెట్టినట్లనిపించింది. ఆ విశాలమైన వాతావరణంలో అతనికి తాను ఎంతో ఎత్తు పెరిగినట్లనిపించింది.

సీతాకోక చిలుకల్లా ఎక్కడ పడితే అక్కడ విద్యార్థినులు, అనర్గళంగా ఇంగ్లీషు మాట్లాడే అధ్యాపకులు. విద్యార్థి సంఘాలు, రాజకీయాలు, ఎన్నికలు, మిత్ర బృందాలు సమావేశాలు, సినిమాలు, పెద్ద పెద్ద షాపులు, షాపులకు వచ్చే అందమైన అమ్మాయిలు—అప్పుడే యౌవనపు గడప తొక్కిన శీనివాస్ మనసు మీద బలంగా పని చేశాయి ఇవన్నీ.

క్రమేపీ విద్యార్థినులతో స్నేహాలు, ఎన్నికల సందర్భంగా కొందరికి సన్నిహితం కావడమూ, పుస్తకాలు ఇచ్చి పుచ్చుకోవడమూ, చివరికి ఒకరిద్దరితో సినిమాలకు, హోటళ్లకు వెళ్లడంవరకూ వచ్చింది కథ.

అందరికన్న శశిరేఖతో అతనికి చాలా సన్నిహిత సంబంధ మేర్పడింది. శశిరేఖ పసితనంలోనే తండ్రిని కోల్పోయింది. ఆమె తల్లి, భర్త వదలిపోయిన కొద్ది ఆస్తితో గుట్టుగా సంసారంచేస్తూ పిల్లకు చదువు చెప్పిస్తోంది. ఈ పిల్ల ధనవంతుల పోకడలు చూస్తూ అందని ఫలాలకు అర్రులు చాస్తూవుండే సమయంలో శ్రీనివాస్ ఆమెకు తటస్థ పడ్డాడు.

క్రమేపీ కాలేజీలో గుసగుసలు ప్రారంభ మయ్యాయి. కొన్నాళ్ళుపోయాక కాలేజీ గోడలమీద శశిరేఖా శ్రీనివాసుల పేర్లెక్కాయి. శశిరేఖ చాలా భయపడింది.

''ఎందుకు భయం? నా ఎం. ఏ కాగానే నిన్ను పెళ్లిచేసుకుంటానుగా'' అని అభయహస్తమిచ్చాడు శ్రీనివాస్.

''మన పేర్లు గోడలమీదకెక్కేసాయే మరి ?'' అన్నది శశిరేఖ.

## కక్ష్యలోనుంచి ఎన్నో చూడగలం

20 ఏళ్ళక్రితం ప్రప్రథమంగా కృత్రిమ ఉపగ్రహాన్ని కక్ష్యలోకి పంపినప్పుడు, త్వరలోనే అంతరిక్ష నౌకలు అమూల్యమైన భూగర్భ సమాచారాన్ని అందివ్వగలుగుతాయని ఎవ్వరూ భావించలేదు.

కృత్రిమ ఉపగ్రహాలనుంచి తీసిన చిత్రాలనుబట్టి భూమిపై పొర దిగువనున్న భూగర్భ నిర్మాణాన్ని చూడవచ్చు.

ఉపగ్రహాల నుంచి తీసిన చిత్రాలను పరిశీలించిన మీదట భూగర్భ శాస్త్రవేత్తలు సరికొత్త కూర్పులను చూడగలిగేరు. అంతవరకు వారు వానిని నిర్లక్ష్యం చేశారు. గోళ పైభాగంలో చాల పరిణతి పొందిన వర్తులాకార స్వరూపాలు వున్నాయని స్పష్టమయింది. వాని స్వభావం ఏమిటో యింకా స్పష్టంగా తెలియ లేదు. వానిలో కొన్ని అరి పోయిన అగ్ని పర్వతాలు. మరికొన్ని గోళాకారమయిన పొరల ఎగుడు దిగుడులు. భూగోళం పైభాగాన వర్తులాకార నిర్మాణ రూపాలు చాల విస్తృతంగా వుండడం ఒక కొత్త విషయమూ, అతి ముఖ్యమైనదీను.

ప్రాచీనకాలం నాటి వర్తులాకారపు అగ్ని పర్వతాలకూ కొన్ని నిజ నిధులకూ సంబంధం వుంది. సోవియటులో ప్రాచీనకాలపు అగ్ని పర్వతాల లావా ప్రవాహాలు విశాలమయిన ఓఖోట్స్క్—చుఖోట్కా వంటి అగ్ని పర్వత మండలాలు ఏర్పడడానికి కారణభూత మయాయి.

కొత్త ఖనిజ నిధులను, ఖనిజ వాయు నిధులున్న ప్రదేశాలనూ కను క్కొనేందుకు అంతరిక్షం నుంచి లభించిన సమాచారంసాయపడుతుంది. ఈ సందర్భంలో చిన్న, పెద్ద గోపురాకార నిర్మాణాలు చాల ఆసక్తిదాయకంగా వున్నాయి.

సముద్రంలో మునిగిన భూఖండ భాగాల (కాంటినెంటల్ షెల్ప్) గురించిన పరిశీలనలకు యిప్పుడు ప్రాముఖ్యం కలుగుతూంది. ఎంత లోతు నీరున్నా ఉపగ్రహాలనుంచి తీసిన ఫోటోలు దీనిని బాగా చూపుతాయి. ఈ షెల్ఫ్‌లో వూడిపోయిన నదుల పడకలు కనబడవచ్చుననీ, వానిలో విలువయిన ఖనిజాలు లభ్యము కాగలవని తలుస్తున్నారు.

అంతరిక్షం నుంచి సేకరించిన సమాచారాన్ని ఉపయోగించడం భూగర్భ విజ్ఞానంలో ఒక నూతన ఘట్టం.

## "అగ్గిపెట్టెతో ఇంద్రజాలం"

అది నేను కాలేజీలో చదువుకుంటున్న రోజులు. ఒకసారి నేనూ మా కాలేజీ స్టూడెంట్స్ కొంతమంది కలిసి 'ఎక్స్ కర్షన్'కి బయలుదేరాము.

నాగార్జున సాగర్, శ్రీశైలం, కాళహస్తి, తిరుపతి, మద్రాసు ముగించుకుని, ఊటీ చూద్దామని టిక్కెట్లు కొనుక్కుని మంగుళూర్ మెయిల్ లోని కిక్కిరిసిన జనరల్ కంపార్టుమెంటులోకి ఎక్కి కోయంబత్తూరు వైపుగా ప్రయాణం సాగించాము.

మా రైలు కాట్పాడి స్టేషన్‌లో పది నిముషాలాగి, అసలే కిక్కిరిసిన మా కంపార్టుమెంటులోకి యింకాస్త జనాన్ని




కూరుకుని తిరిగి బయలుదేరింది.

ఇంతలో 20 ఏళ్ల కుర్రాడు ఒకడు మా పెట్టెలోకి ప్రవేశించి, రెండు చిన్న

## మాయాజాలం

చెక్కముక్కల్ని చేతి వ్రేళ్ల మధ్యలో వుంచి టకటక లాడిస్తూ, కొంచెం చిక్కటి రసంతో కూడిన రెండు పాటలు పాడి, (మేము పాట విన్నందుకు) అందరి వద్ద నుండీ తలో పదిపైసలు వసూలు చేసుకుని వెళ్లాడు.

కాసేపటికి ఇంకొక వ్యక్తి మా కంపార్టుమెంటులోకి ప్రవేశించి, ఏకధాటిగా నోట్లోంచి, ముక్కుల్లోంచి, చెవిలోంచి, తలలోంచి కాలుతున్న పొగలు యీనే సిగరెట్లను తీస్తూ, వాటిని తిరిగి మాయం చేస్తూ, మళ్లీ ప్రయాణీకుల ముక్కుల్లోంచి, నోట్లోంచి, తలల్లోంచి

---

"పోనీ మన పెళ్లి శుభలేఖలు ఇప్పుడే అచ్చయిపోయాయనుకో" అన్నాడు ధీమాగా శ్రీనివాస్.

శశిరేఖ కొండెక్కింది.

ఆ సంవత్సరం ఆమె పరీక్షకూడా కొండెక్కింది.

తర్వాతరెండేళ్లు శ్రీనివాస్‌నే ధ్యానిస్తూ గడిపింది.

ఎం. ఏ. పాసయి తిరిగివచ్చిన శ్రీనివాస్ పునర్దర్శనం కాగానే శశిరేఖ హృదయం పాలవెల్లిలా పొంగింది. శ్రీనివాస్ తనకు తానుగా ఆమె ఇంటికి వచ్చాడు. అంతే కాకుండా ఆమె తల్లికి అన్ని విషయాలూ చెప్పి తన కుల గోత్రాలు వివరించి శశిరేఖా తనూ పెళ్లి చేసుకోవాలను కుంటున్నామని చెప్పాడు.

ఆమె ఎంతో ఆనందించింది. ముహూర్తం పెట్టిద్దామని చూసింది. దగ్గరలో ముహూర్తాలేవీ లేవనీ, రెండు మూడు నెలలు ఆగవలసి వుంటుందనీ అన్నాడు పురోహితుడు.

ఈలోగా శశిరేఖా శ్రీనివాసులు మరీ మరీ దగ్గరగా వచ్చారు. ఒకానొక పెద్ద ఘడియలో వారిద్దరి మధ్య వున్న కట్టుబాటనే బంధీసమైన గోడ కూలిపోయింది.

*  *  *

ఇదే సమయంలో శ్రీనివాస్‌కి రమణితో పరిచయం ఏర్పడింది. వాళ్ళ ఆహ్వానాన్ని పురస్కరించుకుని యింటికి వెళ్లాడు. ఈ కొత్త స్నేహం పెరుగుతున్నకొద్దీ అతని మనసులో శశిరేఖ కృష్ణపక్ష శశిరేఖలా క్రమేపీ చిన్నదై మరీ యింతై చివరికి కనపడకుండా పోయింది. ఇప్పుడతనికి రమణి తోడిదే లోకం.

ఇంతకుముందు శశిరేఖ బొమ్మను వేసిన కుంచెతోనే ఇప్పుడు రమణిని చిత్రిస్తున్నాడు. అతడు వేసిన శశిరేఖ చిత్రాన్ని చూసి ఆమె తల్లి ఎంతో సంబర పడింది. ఇప్పుడు రమణి చిత్రాన్ని చూసి ఆమె తండ్రి చాలా ఆనందిస్తున్నాడు.

శ్రీనివాస్‌కు సినిమాలు, టెన్నిస్, చిత్రలేఖనమూ అభిమాన విషయాలు. ఇవంటే రమణి చెవి కోసుకుంటుంది. ఇద్దరూ వీటిలో ఉత్సాహంగా పాల్గొంటున్నారు.

రమణి తండ్రి పూర్తిగా నవనాగరికుడు. తన కుమార్తె మార్గానికి అతడెప్పుడూ అడ్డురాడు.

శ్రీనివాస్ ఇప్పుడు రమణి ఎక్కడుంటే అక్కడ వుంటాడు. ఎటు నడిస్తే అటు నడుస్తాడు. ఎప్పుడైనా శశిరేఖ జ్ఞాపకం వస్తే రమణిని చూసిన అతడి కళ్లకు ఆమె నిస్తేజంగా, సూర్యుడున్న ఆకాశంలో శశిలా కనిపిస్తుంది.

"అసలు శశిని ఎలా ప్రేమించగలిగాను? ఇంకానయం. పెళ్లి చేసుకున్నాను గాను — ఇప్పటికైనా మించిపోయింది లేదు. ఎంతో కొంత డబ్బు పారేస్తే ఇంకెవరినైనా పెళ్లి చేసుకుని నన్ను మరచిపోతుంది" అనుకున్నాడు శ్రీనివాస్:

— టెన్నిసు పోటీకని విశాఖపట్నం వెళ్ళిన

## అపస్వరాలు

శ్రీనివాస్ వద్దనుంచి ఏ సమాచారమూ లేకపోవడంతో శశిరేఖ గాబరాపడింది. ఆమె వ్రాసిన నాలుగు పుత్తరాలకు జవాబు లేకపోవడంతో ఇక నిలవలేక పోయింది. తల్లితో చెప్పి ఒకనాడు విశాఖపట్నం బయలుదేరింది.

అతడిచ్చిన అడ్రసుకి వెడితే ఇల్లు మారిపోయాడని చెప్పారు. కొత్త ఇల్లెక్కడో తెలుసుకుని అక్కడికి చేరేసరికి సాయంత్రం నాలుగయింది.

శ్రీనివాస్ ఇంట్లోనే వున్నాడు. ఎక్కడికో వెళ్లాలని ప్రయాణమౌతున్నాడు. శశిరేఖను చూడగానే గతుక్కుమన్నాడు.

ముఖాన అర్థంలేని నవ్వు ఒకటి పులుముకుంటూ, "ఏం శశీ, ఎప్పుడు రావడం? రా, కూర్చో. అంతా క్షేమమేనా?" అంటూ కుశల ప్రశ్నలువేసి మర్యాద చేశాడు.

"అంతా క్షేమమేగాని, యింత త్వరలోనే ఈ శశిని మరచిపోతారని ఎప్పుడూ అనుకోలేదు. నాల్గుపుత్తరాలు వ్రాసినా జవాబు లేదు. ఎలావున్నారో ఏమో అని పరిగెత్తుకుని వచ్చాను" అప్పుడే తాము దంపతులైనట్లుగా మన్నిస్తోంది శశిరేఖ. ఈ మన్నింపు శ్రీనివాస్ చెవులకు కఠోరంగా వినపడింది.

"నాలుగుత్తరాలు వ్రాశావా? నాకు మొన్న ఒకటే అందింది, జవాబు వ్రాద్దామని కవరు, కాగితం, అన్నీ అదిగో టేబిల్‌మీద పెట్టుకున్నాను. ఇంతలో నువ్వే వచ్చావు." అని బొంకాడు శ్రీనివాస్.

## మతికట్టు

కాలుతున్న అవే సిగరెట్లను తిరిగి సృష్టిస్తూ, తన హస్తలాఘవ ప్రజ్ఞతో కంపార్టుమెంటులో అందర్నీ ఆశ్చర్య చకితుల్ని చేస్తూ, అందరి దృష్టి తనవైపు మరల్చుకుని ...

లేడీస్ అండ్ జంటిల్‌మన్, సోదరులారా సోదరీమణులారా, భాయిగా నో బహెన్, సహోదరగళే, నా పేరు ప్రొఫెసర్. అబ్రకడబ్రా.

మేము హిందుస్థాన్‌లో కాశ్మీర్, అజ్మీర్, నాగపూర్, ఢిల్లీ, లక్నో, కలకత్తా, మదరాసు, మైసూర్, బెంగుళూర్ దేశాలు తిరిగి మా గారడీ విద్య చూపి, మేము ఎన్నో బహుమానాల్ అందుకున్నాం... మేముచేసే విద్యలు మీరు చూడాలా, చూచి, మెచ్చుకోవాలా, మాకూ మీరు మంచి బహుమానం ఇవ్వాలా...

అంటూ అందర్నీ మాటల గారడీలో పెట్టి, ప్రయాణీకులలో ఒకరి దగ్గర నుంచి అగ్గి పెట్టె తీసుకుని చేతిని బోర్లించి అగ్గిపెట్టెను చేతిమీద వుంచి తన కొక్కడికే తెలుసున్న భాషలో పాట పాడుతూ అగ్గిపెట్టెవైపు గుడ్లప్పగించి చూడసాగాడు. అంతే! ఇంకేముంది!! ఆశ్చర్యం!!!

పాట కనుగుణంగా అగ్గిపెట్టె బేలెన్స్ చేస్తూ, చేతిమీద పడుకోడం, ఏటవాలుగా వుండడం, మళ్లీ నిటారుగా నిలబడడం భంగిమలను అగ్గిపెట్టె చేయసాగింది. అది గమనిస్తున్న కంపార్టుమెంటులో అంతా నిశ్చేష్ఠులయ్యారు.

ఆ మరుక్షణం కంపార్టుమెంటంతా చప్పట్లతో దద్దరిల్లిపోయింది.

*రహస్యం :* ఆ రోజు అగ్గిపెట్టె ఆ విధంగా బేలెన్స్ చేయడంలోని రహస్యం 3వ చిత్రంలో చూపిన విధంగా అగ్గిపెట్టె కవరుకూ, సొరుగుకూ మధ్య, చేతి చర్మం నొక్కిపట్టడంలో వుందని కంపార్టుమెంటులోని నా ఫ్రెండ్స్‌తోసహా ప్రయాణీకులకు ఎవ్వరికీ తెలీనందుకు నాలో నేను నవ్వుకున్నాను.

—భావరాజు కామేష్

"కాబోసు" అనుకుందా అమాయకురాలు.

తల వంచుకొని కాలి బొటన వ్రేలు నేలరాస్తూ, "మా అమ్మ ముహూర్తం కూడా పెట్టించింది, ఇంక సరిగ్గా నెల్లాళ్లుంది. అంతే" అన్నది శశిరేఖ.

శ్రీనివాస్ గొంతులో పచ్చివెలక్కాయ పడ్డట్లయింది. అయితే అబద్ధమాడడం మొదలు పెట్టేశాడు గనుక అదేపద్ధతి కొనసాగించాలనుకున్నాడు.

అతడు తెలివైనవాడు. ఉపాయశాలి.

"ఇప్పుడొక పెద్ద విషమ సమస్య ఎదురయింది శశీ. మొన్న నా జాతకం ఒక గొప్పజ్యోతిష్కుడు చూసి సరిగ్గా రెండేళ్లలో నాకు మారకముందనీ, ఆ గండం గడిస్తే ఇంక పరవాలేదనీ చెప్పాడు. ముహూర్తం రెండేళ్ళు వాయిదా వెయ్యాలన్నమాట."

పిడుగులాంటి ఈ వార్త విని శశిరేఖ ప్రాస్పడి పోయింది. నోటమాటలేక గుడ్లప్పగించి అలాగే నిలబడివున్న ఆమె కళ్లలోకి చూడలేక ముఖం పక్కకు తిప్పుకుని, గోడమీది కాలెండరువైపు తదేకంగా చూస్తూ ఇలా అన్నాడు శ్రీనివాస్ కొద్దిగా కంపిస్తున్న కంఠంతో.

"నాకు తెలుసు ఈ మాట నీకు చాలా బాధ కలిగిస్తుందని. కాని ఏం చెయ్యను? చూస్తూ చూస్తూ చేతులారా బంగారం లాంటి నీ జీవితం ఎలా పాడుచేయను?"

శశిరేఖ మొదటి అఘాతం నుండి ఇప్పటికి తేరుకుంది.

"నాకీ జోస్యాల్లో నమ్మకం లేదు. మన నొసటన ఏమి వ్రాసివుందో అదిఎటూ జరుగుతుంది. అన్నిటికీ నేను సిద్ధపడే వున్నాను. ఈ ముహూర్తం మాత్రం తోసివేయకండి. ఇప్పటికే మన కథ వూరూ వాడా పాకిపోయింది." అన్నది గుడ్ల నీరు కుక్కుకుంటూ.

గోడమీది చూపు తీక్షణంగా ఆమెవైపు మరల్చి, "వీల్లేదు. అలా ఎన్నటికీజరగదు" అన్నాడు శ్రీనివాస్ తీవ్రంగా.

శశిరేఖ కీమారు దుఃఖం కెరటాలుగా పొంగి వచ్చింది. "మరి...మరి..." ఏదో అనబోతుంటే వీధిలో కారు హారన్ అదే పనిగా మోగసాగింది.

"నువ్విక్కడే వుండు. స్నేహితు డొకడు పిలుస్తున్నాడు. ఒక గంటలో వచ్చేస్తాను." అంటూ బయటికి దూకి తలుపు భళ్లున వేసేశాడు. ఆశ్చర్యం నుంచి తెప్పరిల్లిన శశిరేఖ తలుపు తీసేసరికి శ్రీనివాస్ కారెక్కడం, అది స్టార్ట్ కావడం జరిగింది. కాని అదే క్షణంలో స్టీరింగ్ వద్ద అతని పక్క కూర్చున్న స్త్రీ ఆమె కళ్లపడింది. ఆమె అనుమానాలన్నీ బుజువైనాయి. ఆమె అభిమానానికి మానని గాయం తగిలింది.

* * *

శశిరేఖను వదలి వచ్చిన శ్రీనివాస్‌కి రమణి ఎప్పటికన్నా అందంగా కనిపించింది. తన భక్తికి మెచ్చి సాక్షాత్కరించిన సౌందర్య దేవతలా కనిపించింది. ఇటువంటి దేవతను కాదని ఆ శశిని ఎలా పెళ్లి చేసుకోవడం? కాని తాను శశికి గొప్ప అన్యాయం చేస్తున్నానన్న భావం అతని అంతరాల్లో ఎక్కడో చురుక్కు చురుక్కు మని పొడుస్తున్నది. తాను ద్రోహి, నేరస్థుడు, పాపి. అతనికి తన గ్రామంలో వృద్ధ తల్లి తండ్రులు జ్ఞాపకం వచ్చారు. తన యీ చర్యలేవీ వాళ్లకు తెలియవు. వాళ్ల అనుమతి లేకుండానే శశికి మాట ఇచ్చాడు. వాళ్లకు తెలియకుండానే రమణితో అనుబంధం పెంచుకుంటున్నాడు. కాని ఏం చెయ్యగలడు? రమణి తన మనస్సును పూర్తిగా స్వాధీనం చేసుకున్నది. ఇప్పుడు తన మనస్సు తన చెప్పుచేతల్లో లేదు.

ఇలా మథనపడుతున్న అతనికి ఎవరైనా తనను వోదారిస్తే బాగుండు ననిపించింది. రమణి నిశ్చలంగా ముందుకు చూస్తూ డ్రైవు చేస్తున్నది. శ్రీనివాస్ హృదయంలో రేగిన తుపాను ఆమెకేం తెలుసు?

శ్రీనివాస్‌కి అసూయ కలిగింది. ఉక్రోషం ఉబికింది. ఆమె అలా ప్రశాంతంగా స్టీరింగు పట్టుకుని కూర్చోకపోతే నన్ను తన చిగురాకు చేతుల్లోకి తీసుకుని బుజ్జగించరాదా? అనుకున్నాడు.

అతనికి ఆ క్షణంలో ఒక ఆప్యాయత కావలసి వచ్చింది. చిన్నప్పుడు తను ఏడిస్తే తల్లి ఒళ్లోకి తీసుకుని బుజ్జగించడం లీలగా జ్ఞాపకం వచ్చింది. తన ప్రక్కనున్న ఆ స్త్రీతో దైహిక సాన్నిహిత్యం కోరింది హృదయం.

## అపస్వరాలు

శ్రీనివాస్ రమణికి దగ్గరగా జరిగి కూర్చున్నాడు. ఇప్పుడు వాళ్ళ శరీరాలు స్పృశించుకుంటున్నాయి. ఆమె అభ్యంతరం చెప్పలేదు. అలాగే నిశ్చలంగా స్టీరింగు పట్టుకుని కూర్చుంది.

మరింత సాన్నిహిత్యం కోరింది ఏడుస్తున్న అతని హృదయం.

ఇంక ఆగలేక పోయాడు శ్రీనివాస్.

ఆమె భుజంమీద చెయ్యివేసి దగ్గరగా లాక్కున్నాడు.

చేత్తో భుజంమీది అతని చేతిని తీసి వేస్తూ చిరుకోపంతో! "అంత తొందరగా వుంటే నాన్నగారితో మాట్లాడరాదూ?" అన్నది రమణి.

శ్రీనివాస్ ఆవేశం చల్లారింది.

"నిజమే. ఇన్నాళ్ళూ ఎంత మూఢుడిలా ప్రవర్తించాను! ఇంతవరకూ తనకీ సంగతే తోచలేదే. సిగ్గుతో ముడుచుకుపోయాడు శ్రీనివాస్.

"అలాగే. ఈ రాత్రే మాట్లాడతాను" అన్నాడు తన నిశ్చయమంతా కంఠంలో ధ్వనించేలాగ.

బీచ్‌లో క్షణాలు బాగా బరువుగా నడిచాయి. ఇద్దరూ ఎవరి తలపుల్లో వారు మునిగి మౌనంగా అలాగే కాస్సేపు కూర్చుని చీకటి పడకుండానే యింటికి బయల్దేరారు. తన యింటి దగ్గర కారు దిగడానికి మన సొప్పలేదు శ్రీనివాస్‌కి. తిన్నగా రమణితో వాళ్ళ యింటికి వెళ్ళాడు. కారుదిగి చరచరా లోపలకు వెళ్ళిపోయిన కుమార్తెను, వెనుక నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ నడిచివచ్చే శ్రీనివాస్‌ని చూసి ఒక్కనిముషం విస్తుపోయారు వసారాలో వాలు కుర్చీలో కూర్చుని పైపు కాల్చుకుంటున్న బసవ లింగప్పగారు.

శ్రీనివాస్ తిన్నగా ఆయన వద్దకు వెళ్ళి కుర్చీ దగ్గరగా లాక్కుని కూర్చున్నాడు. నెమ్మదిగా తానూ రమణి ప్రేమించుకుంటున్న సంగతీ, తన స్థితి గతులూ వివరించి రమణిని తనకిచ్చి వివాహం జరిపించమని కోరాడు.

"మరి మీ పేరెంట్స్ పెర్మిషన్?" అన్నారు బసవలింగప్పగారు.

"నాకు వివాహ విషయంలో సంపూర్ణమైన స్వేచ్ఛ ఇచ్చారు నా తల్లిదండ్రులు" అన్నాడు శ్రీనివాస్ సగర్వంగా.

"సరే. సాధ్యమైనంత త్వరగా ముహూర్తం పెట్టిస్తాను" అన్నారు బసవ లింగప్పగారు.

ఈ విషయం తను తల్లితండ్రులతో చెబుతాననీ, ఈ లోగా బసవలింగప్పగారు ముహూర్తం పెట్టించి శుభలేఖలు వేయించ వచ్చనీ, తన తల్లితండ్రులేమీ అనుకోరనీ చెప్పాడు శ్రీనివాస్.

* * *

శ్రీనివాస్ ఇల్లు చేరుకునేటప్పటికి రాత్రి తొమ్మిది గంటలయింది. నౌఖరు కుర్రాడు తలుపు తీశాడు. లోపల శశిరేఖ వున్న జాడలేదు.

"ఆయమ్మగారు ఈ సీటి మీ కిమ్మని సంచి తీసుకెళ్ళిపోనారండి" అన్నాడు నౌఖరు కుర్రాడు.

హృదయం తేలికపడ్డట్లనిపించినా, ఎక్కడో ఏదో కలుక్కుమంది.

గబ గబ కవరు చించి చదివాడు.

మూడే వాక్యాలు.

"మీ రెందుకు వివాహానికి ఒప్పుకోవడం లేదో అర్థమైంది. మీ జీవితంలోంచి శాశ్వతంగా తొలగిపోతున్నాను. సెలవు"

కంగారుపడ్డాడు శ్రీనివాస్. ఆ రాత్రి ఎంతకూ నిద్రపట్టలేదు. తెల్లవారు ఝామున కొద్దిగా కునుకు పట్టింది.

పొద్దుట లేచేసరికి ఒంట్లో అస్వస్థతగా వున్నట్లనిపించింది. రోజల్లా బయటికి పోలేదతను. ఆ వేళ తండ్రి వద్ద నుంచి ఉత్తరం వచ్చింది, సంబంధాలు చాలా వస్తున్నాయనీ, ఇంటికొకసారి రావలసింది నీను.

శశిరేఖ పుత్తరం తండ్రి పుత్తరం శ్రీనివాస్ మనశ్శాంతిని చిందర వందర చేసేశాయి. అతను క్లబ్‌కు వెళ్లడం మానేశాడు.

ఇప్పట్లో రావడానికి వీలుపడదనీ, పై నెల్లో తప్పక వస్తానని తండ్రికి వ్రాసి ఒక సమస్యని వాయిదా వేశాడు శ్రీనివాస్. ఒక కోర్సు బి కాంప్లెక్సు ఇంజక్షన్లు పుచ్చుకున్నాక మనిషికి కొంత స్వస్థత చేకూరింది.

ఇలావుండగా ఒకరోజు బసవలింగప్పగారి నౌఖరు నాలుగు కట్టలు శుభలేఖలు తీసుకు

వచ్చాడు. ఒక శుభలేఖ తీసి చూశాడు శ్రీనివాస్. అందులో తన తండ్రి రామలింగస్వామి పేరు రామలింగప్ప అని పడింది. బసవలింగప్పగారు ఆ పేరును కన్నడించారన్నమాట. అసలే దెబ్బలిన్న నరాలతో బాధపడుతున్న శ్రీనివాస్ మండి పడ్డాడు.

''ఛ, ఛ, ఏం మనిషి ఈయన. నాన్నగారి పేరు వగైరాలు స్పష్టంగా వ్రాసి ఇచ్చానే. ఇలా వేయించాడేం. రామలింగప్పట రామలింగప్ప'' అని చీదరించుకున్నాడు. వెంటనే శుభలేఖలో గొప్ప తప్పున్నదనీ, అంచేత మళ్లీ అచ్చు వేయించాలనీ ఒక ఉత్తరం గొలికి పంపాడు.

సాయంకాలం బసవలింగప్పగారే వచ్చారు. ''ఏమిటోయ్. ఏదో తప్పు పడిందని వ్రాశావు'' అంటూ.

ఎప్పుడూ ఆయన్ను చూడగానే భక్తి వినయాలు ముప్పిరిగొనేవి. అటువంటిది ఈ రోజు ఎంతైనా చిరాకు కలిగింది. అతని మనసులో శశిపట్ల, తన తలిదండ్రులపట్ల తన ప్రవర్తన ఒక పక్క, రమణితో తన అనుబంధం ఇంకోపక్క సంఘర్షణ పడసాగాయి.

''అవునండీ. చాలా తీవ్రమైన అచ్చు తప్పు వచ్చింది. మా నాన్నగారి పేరు రామలింగస్వామి అయితే రామలింగప్ప అని అచ్చులో పడింది.'' అన్నాడు తమ పరువు ప్రతిష్ఠలకు, వంశ మర్యాదకు దాని వలన గొప్ప నష్టంకలిగినట్లుగా ముఖంపెడుతూ.

బసవలింగప్పగారికిదేమీ అంతుపట్టలేదు. రామలింగస్వామికి రామలింగప్పకు పెద్దతేడా ఏమీ కనపడలేదాయన కళ్లకు. అదీగాకరామలింగప్ప కన్న రామలింగస్వామి అన్న పేరు ఎలా అందమైనదో ఆయనకు అర్థం కాలేదు.

''ఇదేమంత పెద్ద తప్పోయ్. మీ నాన్నగారిని నేను క్షమాపణ వేడుకుంటానులే. పెళ్లి ప్రయత్నాల్లో వున్నాము. అప్పుడే శుభలేఖలు పంపించేశాము. ఇంక వారం రోజులుంది పెళ్లి'' అన్నారాయన.

శ్రీనివాస్‌కి మరింత చిరాకు ఎక్కువయింది.

''అయ్యా, బసవలింగప్పగారూ, ఇప్పటికే మా నాన్నగారికి నా పెళ్లి విషయం ఇంత వరకు చెప్పక అపరాధం చేశాను. ఇప్పుడాయన పేరును కూడా ఖూనీ చెయ్యమన్నారా? మీ రేమనుకున్నా సరే. దీనికి నే నొప్పను. శుభలేఖలు మళ్లీ అచ్చు వేయాల్సిందే. అవసరమైతే ఇంకో ముహూర్తం పెట్టించి ఇంతకు ముందు శుభలేఖలు పంపినవాళ్లందరికీ వెంటనే తెలియజేయండి. పత్రికాముఖంగా కూడా నలుగురికీ తెలియపరచండి'' అన్నాడు.

బసవలింగప్పగారు ఒక్క క్షణం బిత్తరపోయారు. అతనంత పట్టుదలగావున్నప్పుడు నచ్చచెప్పి ప్రయోజనం లేదనుకుని ఒక్క నిట్టూర్పు విడిచి, ''కానీ, అలాగే చేద్దాం'' అని కాలెక్కారు.

ఆ రాత్రి శ్రీనివాస్‌కి ఎక్స్‌ప్రెస్ టెలిగ్రాం వచ్చింది., శశిరేఖ వంటచేస్తూ ప్రమాదవశాత్తూ ఒళ్లంటుకుని మరణించిందని.

మర్నాడు కాకినాడ వెళ్లి శశిరేఖ అంత్యక్రియలకు హాజరయ్యాడు. చితిపై జ్వాలలు లేస్తూంటే అతని హృదయంలో ప్రజ్వరిల్లిన మంటలు అతనికి, ఆ పరాత్పరుడికి మాత్రమే తెలుసు.

*   *   *

వివాహం పదిహేను రోజులు వాయిదా పడింది. బసవలింగప్పగారు పెళ్లి ప్రయత్నాలు కొంత తాపీగా చేయసాగారు. శ్రీనివాస్ గుండెల్లో రేగిన మంటలను ఆర్పుకొనడానికి వ్యర్థ ప్రయత్నాలు చేస్తున్నాడు.

శశిరేఖకు ప్రమాదవశాత్తు ఒళ్లంటుకోలేదనీ, కావాలనే తనను శిక్షించడం కోసమే అలా చేసిందనీ శ్రీనివాస్ అంతరాత్మ ఘోషిస్తున్నది. కానీ రమణి జ్ఞాపకం రాగానే ''ఏమో అది ప్రమాదమే కావచ్చును. ఆత్మహత్య అయితే తనకు జరిగిన అన్యాయం గురించి వుత్తరాలేవో వ్రాసిపెట్టి మరీ చేసుకునేది'' అంటూ మనస్సుకు సమాధానం చెప్పుకునేవాడు.

వివాహ మింకా పదిరోజు లుందనగా ఒంటరిగా కారులో వెడుతున్న రమణి ప్రమాదానికి లోనయింది. రెండు కారులు ఢీ కొట్టుకున్న ఈ ప్రమాదంలో రమణికి తీవ్రమైన గాయాలు తగిలాయి. ఆమె అతి పరధ్యానంగాను నిర్లక్ష్యంగాను కారు నడపడంవల్ల ఈ ప్రమాదం జరిగిందని అన్నారు చూసినవాళ్లు.

మృత్యువుతో రెండు రోజులు హోరాహోరీగా పోరాడిన వైద్యులు ఇంక లాభం లేదని పెదవి విరిచేశారు. 'శుభలేఖల గురించి తానలా మూర్ఖంగా పట్టు పట్టకపోతే ఇలా జరిగేది కాదేమో' అన్న ఆలోచన శ్రీనివాస్ గుండెల్ని పిండసాగింది.

ఆమె ప్రాణాలు అనంతాకాశంలో కలసిపోగానే బసవలింగప్పగారు దుఃఖంతో పిచ్చివారైపోయారు. ''నీవల్లే ఇలా జరిగింది. ఫో ... ఫో అవతలికి. నీ ముఖం నాకు చూపించకు'' అంటూ ఉద్రేకంతో శ్రీనివాస్‌ని బయటికి నెట్టేశారు.

రమణి మరణం శ్రీనివాస్‌కి గోరుచుట్టు మీద రోకటిపోటులా వచ్చింది. అసలే నలిగిపోయివున్న నరాలు యీ దెబ్బకు తట్టుకోలేకపోయాయి, ఆ రోజు నుంచి శ్రీనివాస్ పూర్తిగా మారిపోయాడు. ఈ విషాదపు మలుపుతో విషాదానికి అతీతమైన ఒక స్థితిలో పడిపోయాడు.



# జీవన పోరాటంలో— ఆశల ఆరాటం

సీరియల్ — పి.వి.ఆర్. శివకుమార్

**జరిగిన కథ :** అల్లరి చిల్లరిగా తిరుగుతూ చెడు సహవాసాలకి లోనైన కొడుకు భానుని పాలిటెక్నిక్‌లో చేర్పించమంటూ చెల్లెలు కౌసల్య, బావ శంకర్రావుల దగ్గరికి పంపిస్తాడు సాంబయ్య. క్రమశిక్షణకి ప్రాణం ఇచ్చే శంకర్రావుగారి సంతానం రాజా, రాధలు. హాస్టల్లో చేరిన భాను చదువుకోకుండా సిగరెట్లు తాగుతూ, పేకాడటం చూసిన శంకర్రావుగారు మందలిస్తారు. రాధకి శంకర్రావుగారు పెళ్లి సంబంధాలు చూస్తున్నారని విని బాధపడతాడు భాను. సాంబయ్యగారికి పక్షవాతం రావటంతో అసలే అంతంత మాత్రంగా ఉన్న ఆర్థిక పరిస్థితి మరింత క్షీణిస్తుంది. మనిద్దరం ఒకటి కావాలన్న భానుతో ముందు నీ బాధ్యతల గురించి ఆలోచించు అని నిర్మొహమాటంగా చెబుతుంది రాధ. రాధ మాటలు, స్నేహితుడు సూరిబాబు కాలేజీనుంచి వెళ్లగొట్టబడటంతో భానులో మార్పు వస్తుంది.

*(గత సంచిక తరువాయి)*

నవంబర్ పరీక్షలయ్యేదాకా తిరిగి యింటి మొహం చూడలేదు భాను. ఆ పరీక్షల్లో ఫస్టియర్ సబ్జక్ట్సు రెండూ రాశాడు. రెండూ ప్యాసవుతానన్న నమ్మకమూ కలిగింది.

అక్టోబర్లో సెకండియర్ తాలూకు ఫస్ట్ టర్మ్ పరీక్షలూ, నవంబర్‌లో ఫస్టియర్‌లో మిగిలిపోయిన పేపర్లూ — వ్రాయాల్సి రావటంతో చాలా కష్టపడిన భాను బాగా నీరసించిపోయినా, రెండూ బాగానే రాయగలగటంతో మానసికంగా ఉత్సాహంగా వున్నాడు. ఇప్పుడిప్పుడు సబ్జక్ట్సుకూడా కాస్త అర్థమవుతున్నాయి.

'ఇహ ఫరవాలేదు. రెగ్యులర్‌గా వుంటే సెకండియర్ ఫైనల్ ఎగ్జామ్స్ కూడా బాగానే రాయొచ్చు' నన్న ధైర్యం చిక్కింది అతనికి.

* * *

ఆ రోజు సాయంత్రం పని వుండి బజార్లోకి బయల్దేరాడు భాను. యిప్పుడు బజారుకి వచ్చినా, ఆర్ట్సు కాలేజీ వైపు గానీ, సినిమా థియేటర్ల వైపు గానీ చూడటం లేదతను. అలా చూస్తే అక్కడున్న అమ్మాయిల కంటే ముందు కళ్ల ముందు సూరిబాబు మెదుల్తాడు! మనసు వికలమైపోతుంది.

అతడెలాంటి వాడైనా, చివర్లో పరిస్థితులెలా పరిణమించినా కలిసి తిరిగినన్నాళ్లూ యిద్దరూ ప్రాణమిత్రులుగానే మెలిగారు. అందుకే సూరిబాబు లేని వెలితి భాను మూర్తి మనసులో తరుచు మెదులుతూనే వుంటుంది. అతడిని తల్చుకు బాధపడుతూనే వుంటాడు.

ఆ రోజు అతడు కాలేజీ గేటు దాటి పాతిక మీటర్లు నడిచేసరికి ఆర్ట్సు కాలేజీ గేట్లోంచి రాధా, ఆమె స్నేహితురాలూ రావటం తటస్థించింది. వెనుక వస్తున్న వీళ్లని అతడు గమనించక పోయినా, ఎదురుగా నడుస్తున్న భానుని వాళ్లు గుర్తించారు.

ఇదివరకటి దురుసుతనం, చురుకుదనం లేకుండా తలొంచుకు ఒక్కడే నడిచి పోతున్న భానుని చూడగానే రాధ మనసుకి కొద్దిగా బాధనిపించింది.

"ఏమిటే మీ బావ అలా తయారయ్యాడూ?" అంది ఆమె ఫ్రెండ్.

తత్తరపడింది అకారణంగానే రాధ, "ఏం? ఎలా తయారయ్యాడు?"

"కనపడటంలా—దేవదాసులా! చుట్టూ యిదివరకుండే స్నేహితులేరీ? ఆ మడత నలగని బట్టలేవీ, నోట్లో నిరతం కాలుతుండే ఆ సిగరెట్ ఏదీ? ఆడపిల్లల్ని అల్లరిపెట్టే చూపులేవీ?"

"ఊహూఁ నువ్వు చాలా గమనిస్తుంటావన్నమాట అబ్బాయిల్ని! ఏం వూరికినే గమనిస్తున్నావా—లేక?" అల్లరి పట్టించి, ఆ ప్రసక్తి ఆపుచేద్దామని ప్రయత్నించింది రాధ.

"అందరినీ ఎందుకు గమనిస్తానూ? ఏదో మా రాధమ్మగారి బావగారు గనక..."

"చాల్లే వూరుకో!" కసిరేసింది రాధ.

* * *

ఆ తరవాతకూడా రెండు, మూడుసార్లు అతడిని బజార్లో గమనించింది రాధ. ఎప్పుడూ అదే వైఖరి. సీరియస్‌గా తలొంచుకు నడిచి పోతుండటమే! ఇదివరలో ఎప్పుడు కనపడినా అతనితో తప్పనిసరిగా ఒకరో, యిద్దరో ఫ్రెండ్సూ, నోటిలో అలంకరణలా సిగరెట్టూ వుండి తీరేవి.

ఇప్పుడు ప్రతి ఆదివారం తప్పనిసరిగా శంకర్రావుగారింటికి వెళ్తున్నాడు. వెళ్లేటప్పుడు ఏదో ఒక బుక్ తీసుకునే వెళ్తున్నాడు. రోజంతా అది చదువుకుంటూనో, లెక్కలు చేసుకుంటూనో కూర్చుంటున్నాడు. మధ్య మధ్య శంకర్రావుగారిని సందేహాలు అడిగి నివృత్తి చేసుకుంటున్నాడు.

ఒక శలవురోజు మధ్యాహ్నం, అతడి కోసం కాఫీ తీసుకు వెళ్లిన రాధ, అతడు దీక్షగా ఏదో లెక్క చేసుకుంటుండటం గమనించి, అక్కడే నిలబడింది. రెండు నిముషాల తర్వాత తలెత్తి చూసిన భాను.

"అరె! నిలబడిపోయావేం? అక్కడ పెట్టి వెళ్లలేకపోయావ్? నేను చూడనే లేదు – సారీ!" అన్నాడు.

"ఫర్వాలేదు... అవునూ, నామీద చాలా కోపం వచ్చేసినట్టుందే!" అంది చిరునవ్వుతో రాధ.

తత్తరపడ్డాడు భాను.

"అదేమిటీ?" అన్నాడు.

"అవును. 'అప్పట్నుంచీ' గమనిస్తున్నాను. నీలో మార్పు స్పష్టంగా తెలుస్తుంటేనూ—"

తలదించుకు బాధగా జవాబిచ్చాడు భాను.

"యీ మార్పు ఎవరిమీదో కోపంవల్లే వచ్చినమాట నిజమయితే, ఆ కోపం నామీద నాకే వచ్చివుండాలి రాధా! యిన్నాళ్లూ నా తప్పు తెలుసుకోలేకపోయినందుకు—"

# ఒక్క ఓడోమాస్ మాత్రమే ఖచ్చితంగా దోమలబారినుండి 2 విధాలుగా కాపాడుతుంది...

## మీరు రాత్రంతా హాయిగా నిద్రపోయేందుకు తోడ్పడుతుంది.

ఓడోమాస్ మరే యితర దోమల నివారిణీ సమకూర్చని రీతిలో రక్షణ సమకూరుస్తుంది:

1



దీని వాసన దోమలను దూరంగా ఉంచుతుంది.

2



దీనిలోగల ప్రత్యేకమైన మూలపదార్థం దోమల బారి నుండి మీ చర్మాన్ని కవచంగా కాపాడుతుంది...రాత్రంతా.

ఇక, ఓడోమాస్ భారతదేశంలో అత్యధికంగా అమ్మబడుతున్న దోమల నివారిణి అంటే ఆశ్చర్యమేముంటుంది మరి!

దోమల బాధకు గురికాకండి—

# ఓడోమాస్

అందుబాటులో ఉంచుకోండి!




CHAITRA-BLS-86 TEL




"నవ్వుతూ అన్నాను భానూ! బాధ పడతావెందుకూ?" జాలిగా అంది రాధ.

"బాధ, నువ్వన్నందుకు కాదు. ఇన్నాళ్ళుగా నా ప్రవర్తన తల్చుకుని!"

"వర్తమానంలో కర్తవ్యం గుర్తించిన తర్వాత, గతం తల్చుకుని బాధ పడాల్సిన అవసరం లేదు భానూ! ఎనీ వే, విష్ యు గుడ్‌లక్" అని, అక్కడినించి వెళ్ళిపోయింది రాధ, అతడు అందించిన ఖాళీ కప్పు అందుకుని.

రెండు క్షణాలు అలాగే చూస్తుండిపోయి ఆ తరవాత ఓ నిట్టూర్పు విడిచి తలొంచుకు మళ్ళీ ప్రాబ్లంలో మునిగిపోయాడు భాను.

## 17

సాంబయ్యగారు పూర్తిగా మంచంపట్టిన మనిషైపోయారు. భార్య బలవంతంమీద మందులు వాడుతుండటమేగానీ, తనకి నయమౌతుందనీ, మళ్ళీ లేచి తిరుగుతాననీ, వ్యవసాయం స్వయంగా చేసుకోగలుగుతాననీ ఆయనకి ఆశ ఏమాత్రం కలగటం లేదు.

ఎప్పుడూ దిగులుగా ఆలోచిస్తూ పడుకోవటం— అదొక్కటే వ్యాపకం! వస్తే నిద్ర— రాకపోతే ఆలోచనలు. అంతే!

భానుకన్న రెండేళ్ళే చిన్నవాడైనా బాబు మీదే భారమంతా పడింది. ప్రతిరోజూ పొలానికి వెళ్ళటం, పనులన్నీ సొంతంగా చేయటం— అతడు యీ ఏడు చదువు సంగతి కూడా మర్చిపోయాడు. బడికి వెళ్ళటం మానేశాడు. ఇష్టమున్నా, లేకపోయినా అందుకు అభ్యంతరం పెట్టే అవకాశం సాంబయ్యగారికి లేకుండా పోయింది. అందుకే అన్నీ గమనిస్తూ కూడా మౌనంగా వూరుకున్నారు.

భాను చదువుమీద కాస్త శ్రద్ధ చూపుతున్నట్టూ, ఇదివరకటికన్నా ప్రవర్తనలో మార్పు కనబడుతున్నట్టూ శంకర్రావుగారు రాస్తున్న ఉత్తరాలొక్కటే సాంబయ్యగారికి కాస్త మనశ్శాంతి ప్రసాదిస్తున్నాయి.

డిశంబర్లో శలవులకి యింటికి వెళ్ళాడు భాను, ఇంటిదగ్గరి పరిస్థితుల్ని మనసుకు పట్టించుకు ఆలోచించబోతే గుండె నీరయిందతడికి. ముఖ్యంగా బాబు స్కూలు మానేసినందుకు చాలా బాధపడ్డాడు. కానీ ఏం చెయ్యటం? స్కూలుకి వెళ్తూ యింటి పనులూ, వ్యవసాయం చూడాలంటే కుదరదు.

"నేనూ చదువు మానేసి యింటిదగ్గరే వుండిపోతాను నాన్నా" అన్నాడు తండ్రితో.

"అందువల్ల ఏం కలిసొస్తుందిరా? తమ్ముడెలాగూ చదవటంలేదు. దేవుడి దయ యీ మాత్రమైనా వుండబట్టి, ఈ మాత్రమైనా వాడు సంబాళించుకు వస్తూనే వున్నాడు.

సగం పైబడ్డ చదువు నువ్వు కూడా మానెయ్యటం ఎందుకూ? యీ ఏడాదం పూర్తిచేసి, నువ్వు ఎక్కడో అక్కడ ఉద్యోగానికి కుదురుకుంటే కొంతన్నా నయం!

ఇహ మీ అమ్మకీ, యీ కుటుంబానికీ నువ్వూ, నీ తమ్ముడే దిక్కు. నేను వుండీ లేనివాణ్ణే కదా!

Interpub/GSC/2/76-R-TEL

# సింథాల్

## దుర్గంధాన్ని నిర్మూలించి తాజాదనం గల్గించే సబ్బు.

CINTHOL

Godrej
CINTHOL
DEODORANT AND COMPLEXION SOAP

చమట వలన గలిగే శరీర దుర్గంధాన్నుండి శక్తివంతంగా కాపాడుతోంది.

ఏ సబ్బు పూర్తిగా వుంచనంత తాజాగా మిమ్ములను వుంచుతుంది.

సౌందర్య రక్షణకై చర్మ రోగ నిపుణులచే సిఫారసు చేయబడింది.

## జీవనపోరాటంలో ...

తొందరపడి నిర్ణయం తీసుకోకు. అన్నారాయన కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ.

ఆయన కంట నీరు చూసిన భాను కదిలిపోయాడు.

"ఏం మాటలు నాన్నా అవి! కాస్త ఓపిక పట్టినా, నీకు బాగా తీరుతుంది. మళ్ళీ నువ్వు పొలానికి వెళ్ళాలి - అరక పట్టాలి. అప్పుడే మా కందరికీ ఆనందం. ఆ రోజు తప్పకుండా వస్తుంది నాన్నా!" అన్నాడు గద్గదంగా.

"పోనియ్‌రా! నువ్వు కాస్త బుద్ధిగా మసులుకుంటూ, ఓ మంచి ఉద్యోగస్థుడివయితే నా పంట పండినట్టే కదూ! ఇంకా నేను అరక పట్టవలిసిన పనేముంది?" అన్నాడు సాంబయ్యగారు.

"ఇంకా అలాగ మాట్లాడకు నాన్నా! ఈ జన్మలో మళ్ళీ నీకు బాధ కలిగేలా నేను ప్రవర్తించను. నాకు బుద్ధొచ్చింది నాన్నా పూర్తిగా బుద్ధి తెచ్చుకున్నాను" తండ్రి చేతులు పట్టుకుని కళ్ల నీళ్లతో అన్నాడు భాను

చాలా రోజుల తర్వాత ఆ రోజు కంటి నిండా నిద్రపోయాడు సాంబయ్యగారు.

* * *

శలవులై తిరిగి వచ్చినప్పట్నుంచీ అత్తయ్యగారింటికి వెళ్ళటానికూడా తీరిక చిక్కటం లేదు భానుకి.

ఆదివారాల్లో కూడా వెనకబడుతున్న డ్రాయింగ్ ష్లేట్స్ గీసుకోవటానికీ, కాలేజీకి వెళ్తున్నాడు లేదా మిగతా రోజుల్లో తన లెసన్స్ చదువుకునే రఘురాంతో కూర్చుని అర్థంకానివి చెప్పించుకుంటున్నాడు. రఘురాంకూడా శ్రద్ధతీసుకుని చెప్తున్నాడు అతనికీ అవి రివిజన్‌లాగా తోడ్పడుతుంటాయి కాబట్టి!

ఈలోగా సప్లిమెంటరీ పరీక్షల ఫలితాలు వచ్చాయి. భానుకి రెండు సబ్జక్ట్సుల్లోనూ యాభై పైగా మార్కులొచ్చాయి. అతడిలో ఉత్సాహం పెరిగింది.

పెద్ద విశేషాలు లేకుండానే ఫైనల్ టరమ్ గడిచిపోయింది. సెకండియర్ 'హాన్ ఎగ్జామ్స్' రాసేసి గుండె నిండుగా గాలి పీల్చుకున్నాడు భాను.

(44వ పేజీ చూడండి)

# కోస్తాను కబళించిన తుఫాన్ రక్కసి!



గ్రామాలను ముంచింది — కొంపలు పీకింది — ఇళ్లు కూల్చింది — యింటిల్లిపాదినీ అనేకచోట్ల హతమార్చింది. పై దృశ్యాలు ఒంగోలు, గుంటూరు జిల్లాలలోవి.

**బంగాళాఖాతమంతా గగ్గోలెత్తి — అన్నపూర్ణగా వాసికెక్కిన ఆంధ్రదేశంమీద కక్ష పూనినట్లు - ప్రాణ దాహంతో మహమ్మారియై మహోగ్ర ఝంఝామారుతమై ప్రకాశంజిల్లా వేటపాలెం దగ్గిర ఒక చెంప తీరమెక్క — రెండోవేపు — కృష్ణాజిల్లా కృష్ణానదీ కొసన కోన గ్రామంలో ఉప్పెనగా నవంబర్ 19న జైత్రయాత్ర చేసింది. దివ్యసీమగా వాసికెక్కిన దివిసీమమీద బడబాగ్ని సంచలితమైన ఉప్పెనగా — తాడి ఎత్తు పడగలు వేలకు వేలు ఎత్తి విరుచుకుపడి జనాన్నీ వారి ధనాన్నీ, పంటనీ, పశువులనీ వారి వర్తమానాన్ని, భవిష్యత్తుని దగ్గంకడ్చి ముడివేసి — సర్వనాశనం చేసి — బ్రతికున్న ప్రతివాడి గుండెల్లోను రగిలే విషాదాగ్నిగా, మానని ఎర్రనిగాయంగామిగిల్చిపోయింది!**

## తాజా కాలమ్

నూరేళ్ల చరిత్రలో యిటువంటి ఘోర విపత్తును ఆంధ్రు లెరుగరు... ఈ పెను గాలికి మహోగ్ర విష జలధారలకీ మనుషులు, వేలాదిగా ప్రాణాలొదిలేశారు— ఫ్యాక్టరీలు, మిల్లులు తలవొగ్గి కూలిపోయాయి— ఈ రక్కసి "గాలివాన," రైళ్లను తోసేసింది. (ఫొటోలు చూడండి)— విద్యుత్ స్తంభాలను, మహా వృక్షాలను పెకలించి మెళికలు తిప్పి లుమ్మలు చుట్టి—సానుభూతి సహాయ సదుపాయాలు కూడా బాధితులకి రాకుండా— దారికడ్డంగా పడేసింది !

ఈ దారుణ భీషణ ప్రకృతి ఉదధిని ఆయుధంగా వాడి తీరం వెంబడి వేలకువేల



# సైతాన్ తుఫాన్ - పెను ఉప్పెనల

ఎకరాల పచ్చని పైరులను ఉప్పు నీట ముంచెత్తి— నిండు ప్రాణాలను నిలువునా దోచుకుని— దాహం తీరిన రక్కసి పాత్రము, ఆకలి తీరిన బెబ్బులి— కంకాళాన్ని విసిరేసి నట్లు బందరు— అవనిగడ్డ తాలూకాల (కృష్ణాజిల్లా) లో 350 చదరపు మైళ్ళ మేర 80 గ్రామాలమీద— మృత కళేబరాలను విగత వస్త్రులను చేసి విసిరి విసిరి పారేసింది !

అబ్బా ! యీ ప్రాంతానికి రాబందులు కూడా చేరలేని స్థితి— కన్నీరందరికీ కారి కారి— కసి తీర్చుకున్న కడలిలో కలిసిపోగా— ఏడ్వలేని స్థితి—ఈ స్థితిలో ఆంధ్రరాష్ట్రం లోని సగం మంది జనాభా— మరొక ఉపద్రవం 'కలరా' పొంచి వుండగా శవజాగరణ చేస్తున్న విషాద నిశీధులలో [నవంబర్ 19 20, 21, 22, 23] అక్కడకు పోయి చూస్తున్నప్పుడు— ఏడుపొచ్చింది !

ఔను రెండు రకాలుగా ఏడుపొచ్చింది ! చావుల సంఖ్య 15 వేలు లేదా 20 వేలు అది ఎంతైనా వేల సంఖ్యయే—ఆస్తినష్టం సంఖ్య వంద కోట్లు కాదు 200 కోట్లు రూపాయిలు— లేదా యింకొంత ఎంతైనా అది వందల కోట్లలోనే నష్టం— యీ అంచనాలు కాదు ముఖ్యం— వాణిజ్య వ్యవసాయ పంటలకు 15 లక్షల ఎకరాలు లేదా 20 లక్షల ఎకరాలు ఎంతైనా అది లక్షల ఎకరాలలోనే— కాని యిదికాదు—అన్నార్తులై నిరాశ్రయులై— కురుక్షేత్రంలో బంధుకోటి విగత సైన్యాన్ని వెతుక్కుంటున్నట్లు— పోయిన ఆత్మీయుల్ని— పోకుండా మిగిలిన తమ ప్రాణాలని కూడా చూసుకుని కుమిలి కుమిలి పోతున్న పేద గ్రామీణ ప్రజానీకాన్ని— యీ బాధలకు అతీతమై— విగత జీవులైన వారి భౌతిక కాయాలకు పట్టిన కుళ్ళు గతిని చూడాలి.

వారికి ప్రభుత్వ యంత్రాంగం ఎంత యత్నించినా చేయలేకపోతున్న తక్షణ సాయాన్ని గమనించినప్పుడు నీరైపోని వాడుండడు !

విపత్తు పల్లెకారులది, రైతులది ఆంధ్రులది, దక్షిణాత్యులదీ కాదు— యావత్ భరతావని చేసుకున్న పాడునోము ఫలితమంటూ వాపోని వాడులేడు.

పైన : ఉప్పెన విసిరిపారేసిన వేలాది తీర వాసులలో కొంతమంది అభాగ్యుల అనాథ ప్రేతాలు...భవనాలు కూలి వాటిక్రింద తుత్తునియలైన నిర్భాగ్యులు



తుఫాన్ మరపడవలను భూమ్మీదికి, రైలు బండ్లను గోతుల్లోకి త్రోసేసింది — ఫ్యాక్టరీలని, మిల్లుల్ని కూల్చేసింది. కృష్ణా, గుంటూరు జిల్లాల దృశ్యాలు యివి.



# ఉప్పెనదాడికి అల్లాడుతున్న కోస్తాంధ్రా

## ధనం జనం రెండూ ధ్వంసం

ధాన్యమేగాదు రూపాయలు కూడా పండించే జిల్లాలు గుంటూరు, క్రిష్ణాలు— ఇవి పోయాయి—శవాల గుట్టలమీద—"వల్ల కాటి కూడు" తినమని — త్రాగ నీరులేక అంటువ్యాధి వ్యాప్తికి అడ్డుదారులుగా— చుట్టూరా వెక్కిరిస్తూ నిలబడిన నీళ్లు త్రాగమని ఛాలెంజి చేస్తుంటే — ఆ దశలో అక్కడ చీరాలనుంచి గుంటూరు విజయ వాడల మీదుగా, సముద్రతీర వాడలైన ఎన్నో వందల గ్రామాలు విధ్వంసక జ్వాల వాతలకు గురియై వున్నప్పుడు—

పగలూ రాత్రీ కూడా వెల్తురు లేక— రాకపోకలు లేక — ఒక కాళరాత్రి ఐపోయి నప్పుడు—వేలకు వేలమంది — శవాలు కుళ్లి దుర్గంధ భూయిష్ఠమైపోయిన ప్రాంతాల నుంచి కాళ్లమీద ఆధారపడి — వలసపోతున్న ప్పుడు—వారికి అందవలసిన సహాయం అంద డంలో — ఆధునికమైన పద్ధతులు అనుస రించలేని అధికార యంత్రాంగం యొక్క దీనస్థితిని చూసినప్పుడు — ఆ స్థితిని అక్షరాల కెవడు ఎక్కించగలడు ?

## పరోక్షంగా 60 కోట్లమందికి

ఈ తుఫాన్ ఆ పెనుఉప్పెనదెబ్బ కోస్తాలోని కోటిమందికి కాదు పరోక్షంగా 60 కోట్ల భారతీయుల గుండెల్లో గ్రుచ్చు కుంటున్నది—

గుంటూరు జిల్లాలో, ఒంగోలు జిల్లాలో భవనాలు స్తంభాలు రూపంలో నిలబడ్డ సౌభాగ్యం నాగరికత కూలిపోయింది. దాన్ని లేవనెత్తడానికి — ఎన్నో వేలమంది — మందీ మార్బలం— క్రెయినులు, టాంకులు, ఆధునిక యంత్రాలూ అవసరం కాగా వాటిని హుటాహుటి — సైన్యంచేత లేదా సైన్యేతర దళాలచేత తరలించలేనంత నిస్తేజమై షాక్ తినేసిన ప్రభుత్వ యంత్రాంగంమీద కూడా జాలి, దుఃఖం వచ్చాయి.

## బ్రతికున్న వారు గట్టెక్క లేనిస్థితి!

మామూలు స్థితికి రావాలి. ఆంధ్ర భూమిలో సగభాగం క్రుంగిపోయింది. అది లేవాలి అంటే ఆసుపత్రులకైనా దీపాలు —











నిరాశ్రయులకైనా నీళ్ళు సత్వరంగా అందాలంటే ఏమి చెయ్యాలన్నది తోచదు అన్నమాట— రైళ్ళూ బస్సులూ, వైర్‌లూ అన్నీ పోయినప్పుడు ఎంత కష్టమో యిప్పుడు తెలిసింది! హెలికాప్టర్లమీదనుంచి ఉప్పునీట మునిగివున్న గ్రామాలలో 10 టన్నుల ఆహారం పొట్లాలుగా కట్టి పారేస్తూంటే— అవి తినడానికి 'శవాలు' లేవలేదు — మిగిలిన మొండిజీవులు — తీరమెక్కి పీనుగుల మధ్యగా ఉప్పునీటిని ఉమ్మికుంటూ కోడూరు (అవనిగడ్డకి 6 మైళ్ళు) ప్రాంతంలో — రోడ్డుమీద పడినప్పుడు ప్రయివేటు లారీలవాళ్లే రూపాయి అర్ధా పుచ్చుకుని వారికి రవాణా సదుపాయం ఏర్పాటు చేస్తున్నప్పుడు — శవాలు కుళ్ళిన గాలి పీల్చుకుంటూ 80 గ్రామాల ప్రజలు నిస్సహాయులై పోయి వుండిపోయినప్పుడు — కలరా గోతికాడ నక్కలాగ పొంచివుంది.

## శవ సంస్కారంకోసం దిక్కులు

వేలకొద్దీ మృత కళేబరాలను పూడ్చడం— సాధ్యం కాదు — కాని వాటిపై పెట్రోలు పోసి ఎక్కడికక్కడ దహనం చేయడం అందుకు ట్రక్కులు; చురుకైన పటాల ము రావడం అవసరం కాని — యింత ఉపద్రవపు షాక్‌కి తట్టుకోలేకపోయికాబోలు సిబ్బంది — ఆ పని చేయలేకపోయారు (నవం 22)

## ఉప్పెన దెబ్బతీసిన తీరు

1863 ప్రాంతంలో వచ్చిందిట! ఉప్పెన—యిప్పుడు నూటపద్నాలుగేళ్ళ తర్వాత మూరేళ్ళకు చాలని పోటు పొడిచింది!

ఇది కృష్ణానది సముద్రంలో కలిసే దగ్గర నదికి అటూ యిటూ కూడా విజృంభించింది. బందరు తాలూకాలో తీరాన పడి పల్లెకారులను, రైతు కూలీలను— వారి ఆస్తి, పంటలను నమిలి నమిలి సారం మింగి చల్లపల్లి బందరు రోడ్డుదాకా అంటే ఏడెనిమిది మైళ్ళ— విగత జీవాలను చెరుకు నమిలి పిప్పిని ఉమిసే వింత రక్కసిలాగా

(47వ పేజీ చూడండి)

తుఫాన్ రక్కసి తోటలను మట్టేసింది పెద్ద పెద్ద యినుప కట్టడాలని (బొమ్మ ఇబ్రహీంపట్నం ధర్మల్ ప్రాజెక్టుది) ఉమ్మలు ఉమ్మలు చుట్టి కాలిక్రింద త్రొక్కేసింది — వేలకు వేల పశువుల్ని పైశాచికంగా కబళించింది.

## డాక్టర్ సలహాలు

ఎన్. ఎల్. — శ్రీకాకుళం

మా స్నేహితురాలికి తొడభాగమున ఎర్రగా కందిపోయి మంటగా వుంటుందట. దీనికి కారణ మేమిటి ? నివారణోపాయము తెల్పండి.

★ స్త్రీలలో తొడభాగం ఎర్రగా కందటం ''అలర్జీ'' వల్ల అయివుంటుంది. ''విట్ ఫీల్డ్ ఆయింట్‌మెంట్'' పైపూతగాను, లోనికి అవిల్ మాత్రలు పూటకి 1/2 మాత్ర వంతున రోజుకి రెండుపూటలుగా ఒక వారంపాటు వరుసగా వాడటం మంచిది. శరీరంలో రోగనిరోధకశక్తిని పెంపొందించడానికి ''మల్టీ విటమిన్ మాత్రలు'' రోజుకి రెండువంతున వాడుతూవస్తే మంచిది. దురద మరీ యెక్కువగావుంటే గ్రిసోవిన్ మాత్రలు రోజుకి మూడువంతున వరుసగా 10 రోజులపాటు వాడాలి.

ఎమ్. ఎస్. — హైదరాబాద్

నా వయస్సు 21 సం.లు. ఎత్తు 5'.1". నేను ఎత్తు పెరుగుటలేదు. తిన్న ఆహారము బాగా జీర్ణమవుతోంది. అయినా చాలా బక్కగా వున్నాను. నాలో బలహీనత ఎక్కువగా వున్నది. శరీర దారుఢ్యతకు మీ సలహా ఏమిటి ?

★ ఎత్తు పెరగటం అనేది ప్రకృతిసిద్ధంగా ఏర్పడే అంశం. మీ ప్రస్తుత సమస్య బరువు పెరగటమా లేక ఎత్తు ఎదగటమా అనేది తెలియటల్లేదు. బలహీనత కూడా వుందని వ్రాశారు కాబట్టి బరువు పెరగటం మీ ముఖ్య సమస్య అనుకుంటాను. మీరు ఆహార విషయంలో తగిన జాగ్రత్త, పోషకాహారం క్రమంగా తీసు కొంటే బరువు పెరిగే అవకాశం వున్నది. ఆహారంతోపాటుగా తగినంత వ్యాయామం అవసరం. ఇలా చేయటంవల్ల శరీర ధారుఢ్యం దానంతట అదే ఏర్పడుతుంది. ఆహారంలో ఎక్కువ మాంసకృత్తులు విటమిన్లు వుండే విధంగా, ఆహార పదార్థాలని ఎన్నుకోవటం అవశ్యం —

ఎస్. కె. ఆర్. — రాజమండ్రి

నా వయస్సు 22 సం.లు. నాకు గొంతు నొప్పి ఎక్కువగా వున్నది. 'వొకాసిల్' వాడినా తగ్గలేదు. దీనికేమి చెయ్యాలి ?

★ గొంతు నెప్పికి ఎన్నో కారణాలున్నాయి. ''టాన్సిల్స్'' వాయటం, గొంతు లోపలి ఫారింగ్స్ వాపు, ఊపిరిగొట్టాలు పై భాగం అయిన ''లారింగ్స్'' వాయటం మొదలయిన వాటివల్ల ఈ నెప్పి ఏర్పడవచ్చును.

గొంతు భాగాన్ని పరీక్ష చేయించుకోకుండా మందులు వాడితే ప్రయోజనం కనబడకపోవటం సహజమేకదా !

మీరు ఇ. ఎన్. టి. వైద్యులచే మీ గొంతు పరీక్ష చేయించుకొని తగిన సలహా పొంది వారు సూచించిన మందులను వాడితే ఫలితం కనబడు తుంది.

టి. ఎల్. — కాకరాల

నా వయస్సు 30 సం.లు. నాకు 2,3 దినముల కొకసారి వైట్ డిస్‌ఛార్జి కన్పిస్తుంది. నా పెండ్లిఅయిన దగ్గరనుండే ఇలా జరుగుతోంది. పెండ్లి అవకముందు బహిష్టు అవుటకు ముందు వారంరోజుల నుండి ఇలా జరిగేది. , రాను రానూ రోజూ కనిపిస్తోంది. నేను ట్యూబెక్టమీ చేయించు కున్నాను. ట్యూబెక్టమీ వలన ఇలా జరుగుతుందా? లేక ఎందువల్ల జరుగుతుంది.

★ ట్యూబెక్టమీకీ ప్రస్తుతం మీకు వున్న వైట్ డిస్చార్జికీ సంబంధంలేదు ఎందుకంటే ఈ లక్షణం మీకు వివాహం అయిన దగ్గరనుంచీ ఎక్కువగా కనబడుతున్నదని మీరే వ్రాశారుగా !

పోతే ఈ లక్షణం ''ట్రైకోమోనాస్ వెజైనాలిస్'' అనే క్రిములు స్త్రీ పురుష లిరువురికీ జననేంద్రియాలలో వుండటంవల్ల ఏర్పడవచ్చును. దీనికై మీరు లేడీ డాక్టర్ వద్ద పరిశోధింపజేసుకొని రోగనిర్ధారణ అయిన తర్వాత వారి సలహాప్రకారం, ఫ్లజైల్ మాత్రలు — మీరిద్దరూ వాడవలసి వుంటుంది.

*—డా॥ కె. వెంకటేశ్వరరావు*

## సీరియల్

# రాగబంధం

## యార్లగడ్డ సరోజినీదేవి

### 16

*(గత సంచిక తరువాయి)*

శనివారం కావటంతో చీకటితోనే లేచి తలారా స్నానం చేసి పూజకని పువ్వులు కోసం తోటలోకి వెళ్లింది విజయ. ఒక్కో చెట్టున పువ్వులు కోసి సజ్జలో వేసుకుని ముందుకు నడుస్తున్నదల్లా సిమెంటు బెంచీమీద ముడుచుకుని పడుకునివున్న శ్రీనివాస్‌ని చూసి ఆశ్చర్యపోయింది. భోజనానికి రాకపోవటానికి కారణం తను మరోక రకంగా ఊహించుకుంది. అతనెందుకు లోపలికి రాలేకపోయాడో యిప్పుడర్థమయింది. ముడుచుకుని పడుకున్న తీరు చూస్తుంటే విజయ మనసు కలత చెందింది.

నిన్న సాయంత్రం తనన్న మాటలకు బాధపడి తిరిగి యింట్లోకి రాలేకపోయాడని అర్థం చేసుకుంది. తానెంత తొందరపడింది? ఆకలితో చలితో శ్రీనివాస్ మనసు ఎంత ఆక్రోశించిందో?? సజ్జను క్రిందపెట్టి అతన్ని తట్టి లేపింది. బద్ధకంగా మరోవైపుకి తిరిగి పడుకుంటే బలవంతంగా లేపి కూర్చోబెట్టింది. కళ్ళు తెరవకపోతే రెండు బుజాలనూ పట్టుకుని కుదిపింది.

కళ్లు విప్పి చూసిన శ్రీనివాస్ తన బుజాలను పట్టుకుని నిలబడివున్న విజయను ఆశ్చర్య విస్ఫారిత నేత్రాలతో చూడసాగాడు. అతనలా చూడటం విజయకి ఆశ్చర్యం కలిగించింది. తాను లేపటంతో అలా కొరికేసేలా చూస్తున్నాడా? ఏమిటనుకుంది. తనను తాను చూసుకుని ఎంతో సిగ్గుపడింది. అప్రయత్నంగా తాను శ్రీనివాస్‌ని తాకినందుకు అతనివైపు చూడలేక తల తిప్పుకుని నెమ్మదిగా చేతులు తీసేసింది. ఇంక అక్కడ వుండలేకపోయింది.

"అయాం సారీ బావా!"

అని తొందరగా యింటిలోకి వెళ్లిపోయింది. తలగడలో ముఖం దాచుకున్నది. ఎన్నెన్నో జ్ఞాపకాలు మనసులో తరుముతుంటే వాటినలాగే కళ్లముందు నిలుపుకుని చూసుకోసాగింది.

సిమెంటు బెంచీమీదనుంచి లేవగానే కాలికి పూలసజ్జ తగిలి పడిపోయింది. "అయ్యో" అనుకుంటూ సజ్జను తీసి క్రిందపడిన పూలను సజ్జలోకి ఎత్తి లోపలికి తీసుకువెళ్లి విజయను పిలవటానికి ధైర్యం లేక తీసుకెళ్లి దేవుడింటిలో పెట్టివచ్చాడు.

ఎవరి ప్రమేయం లేకుండానే తన పనులు తాను పూర్తిచేసుకుని భోజనానికి వెళ్లేసరికి భాస్కర్ కూర్చునివున్నాడు. అన్నగారిని చూసి గతుక్కుమన్నాడు.

"రాత్రంతా ఎక్కడున్నావు శ్రీనూ?" అనడిగాడు భాస్కర్.

"చల్లగాలికి తోటలో కూర్చుంటే నిద్ర వచ్చేసింది. అలాగే బెంచీమీదపడి నిద్రపోయాను అన్నయ్యా!"

"నమ్మమంటావా నీ కట్టుకథలను?"

"నిజం అన్నయ్యా! కావాలంటే విజయను అడుగు!"

"నీకోసం అర్ధరాత్రి వరకూ ఎదురు చూస్తూనే వున్నది విజయ. ఇంకా విజయను అడగమంటావేమిటి??"

"నిజం అన్నయ్యా!"

"నిజంగా నువ్వు రాత్రి తోటలో పడుకుని వుంటే యింకెప్పుడూ నీ తిరుగుళ్ల సంగతి అడగను. విజయను అడగమంటున్నావుగా! అడుగుతాను. నిజం కాకపోతే నిన్నేమి చేస్తానో చూడు!"

అంటూ కూర్చున్నవాడల్లా లేచి విజయ గది వైపుకి వెళ్లబోతున్న భాస్కర్‌కి కిచెన్ గుమ్మం దగ్గరే ఎదురయింది విజయ.

"ఏమ్మా విజయా! రాత్రి శ్రీను తోటలోనే పడుకున్నాడా?"

విజయ ఏం సమాధానం చెప్పతుందోనని చెవులు రిక్కించాడు శ్రీనివాస్.

"అవును పెదబావా! ఏ స్నేహితుడి రూంలో పడుకున్నాడో అనుకున్నాను. కాని! తోటలో సిమెంటు బెంచీమీద పడుకునివుంటే!"

"ఆహ్! ఒక్క రాత్రికే వాడి వళ్ళు హూనమయినట్టు బాధపడతావేమిటి? అన్నట్టు మీ యిద్దరూ రాజీపడి ఒకరిమీద మరొకరు నిజాలను చెప్పకోవద్దని అనుకున్నారా? ఏమిటి?"

"ఛా పెదబావా! రాజీ అనేది మా ఇద్దరి మధ్య కుదురుతుందనే మాటకల్ల! నేను నిజమే చెప్పాను!"

విజయ అలా అనేసరికి శ్రీనివాస్ నీరు కారిపోయాడు. "వట్టి మొండిది! ఆ మొండితనాన్ని వదిలించితేనేగాని!" పళ్లు నూరుకున్నాడు.

భాస్కర్ లోపలికి వచ్చి కుర్చీలో కూర్చున్నాడు. తమ్ముడువంక చూస్తూ—

"నువ్వే గెలిచావు శ్రీనూ! విజయ అలా చెప్పకపోయినట్లయితే నాన్నగారి వరకూ వెళ్లేది! ఇకనుంచయినా ఆ తిరుగుళ్ళు మాని వేళకి యింటిపట్టున వుండటం అలవాటు చేసుకో! రాజీ మా యిద్దరిమధ్యా కుదరటం కల్ల! అంటోంది విజయ. కల్లని కల చేస్తే సరిపోతుంది!"

విజయవంక చూస్తూ గ్రుడ్లు మిటకరించాడు శ్రీనివాస్ క్రోధంతో! విజయ నవ్వుకుంది. ఇద్దరికీ తానే వడ్డించింది.

"ఈ సాయంత్రం తోటలోకి వెళ్దాం అనుకుంటున్నాను బావా!"

"వెళ్ళమ్మా! కారుని ఎన్ని గంటలకు పంపించమంటావు?"

"నాలుగు గంటలకు పంపించండి. అన్నట్టు అక్క ఎప్పుడు వస్తుంది? ఒక్కదానికీ ఏం తోచక బోర్ కొడుతున్నది. త్వరగా రమ్మనమని ఉత్తరం వ్రాయి పెదబావా!"

"అలాగేనమ్మా!"

వాళ్లిద్దరి మాటలూ శ్రోతయై వింటున్నాడు శ్రీనివాస్! అంతకుముందునుంచీ ఒక వింత అనుభూతికి లోనయినవాడల్లా; అసలేమీ జరుగనట్టే విజయ వుండటంతో నిరుత్సాహపడ్డాడు. ఇంకా విజయ చేతులు తన బుజాలమీద వున్నట్టే అనుభూతి చెందసాగాడు. ఆ దృష్టితో విజయను కళ్లతోనే కొరుక్కుతినేలా చూడసాగాడు. అతని

**జరిగిన కథ 11** ముప్పయ్యేళ్లతర్వాత పుట్టింటి కెళ్లిన పార్వతమ్మ, వదిన జానకి చనిపోవటంతో చిన్ననాడే తండ్రిని, ఇప్పుడు తల్లిని కోల్పోయిన విజయని తనతో తీసుకువస్తుంది. తన ఈ ఉన్నత స్థితికి కారణం భార్య పార్వతమ్మేనని రామనాథం నమ్మకం. పార్వతమ్మ పెద్దకొడుకు భాస్కరం. అతని భార్య సుందరి. సుందరికి నల్గురితో కలసిమెలసి తిరగటం గిట్టదు. చిన్నకొడుకు శ్రీనివాస్‌కి దుడుకుతనం ఎక్కువ. పాతికేళ్ళ క్రితం... పరంధామయ్యగారి కొడుకులు జగన్నాధం, గోపాలంల భార్యలు సుభద్ర, జానకిలు. కాపురానికి వెళ్లకుండానే వైధవ్యం పొందిన ఆడబిడ్డ పార్వతికి వివాహం చేయటానికి మామగారి అనుమతి తీసుకుంటుంది జానకి. సుబ్బయ్య మాష్టారి శిష్యుడు రామనాథంతో పార్వతి వివాహం జరిపిస్తుంది జానకి. ఇద్దరు మగపిల్లల తల్లవుతుంది పార్వతి. పార్వతి జీవితం చక్కబడిందనే తృప్తితో కళ్లు మూస్తాడు పరంధామయ్య ... విజయ బి. ఏ. లో చేరుతుంది. చదువుమీద శ్రద్ధలేక దురలవాట్లకు లోనైన శ్రీనివాస్ దుడుకు స్వభావాన్ని చూసి బాధపడుతుంది విజయ. శ్రీనివాస్ స్త్రీలోలుడని తెలుసుకున్న విజయకు అతనిపై అసహ్యం కలుగుతుంది.

చూపులనేమీ లెక్కచెయ్యలేదు. అసలు తామిద్దరి మధ్యా ఏమీ జరుగనట్టే నటించసాగింది.

ఆరోజు ఆదివారం కావటంవల్ల శ్రీనివాస్ ఎక్కడికీ వెళ్లలేదు. తోటలోకి పట్టుకువెళ్లవలసిన సామాగ్రిని, పళ్లను బుట్టలకు సర్దివుంచింది. తల దువ్వుకునేందుకు డ్రస్సింగ్ టేబుల్ ముందు కూర్చుని అద్దంలో చూసుకుంటూ తల దువ్వుకుంటుంటే బుజాలమీద బరువుగా చేతులు పడటంతో ఉలిక్కిపడింది. అద్దంలో చూసుకుంటే శ్రీనివాస్ వెనుకగా నిలబడి బుజాల మీద చేతులుంచి చెంపకు చెంప ఆనించి అద్దంలో చూసుకుంటుండగా దువ్వెనకు వంగిని అతని క్రాపులో చేతులు దూర్చి రేపుతూ అలవోకగా శ్రీనివాస్ కళ్ళల్లో కళ్లు పెట్టి చూడసాగింది. తిలకంబొట్టు శ్రీనివాస్ బుగ్గకు అంటుకుంది.

"వట్టి అల్లరిపిల్లవి!"

"నీకంటేనా ?"

"మాటల్లో నీముందు నేను ఓడిపోతానులే!"

"ఆఁ... నువ్వే తక్కువ! ఏ గోపికా మాటలు నేర్పలేదేమో ?"

"ఉహుఁ... నువ్వు నేర్పితేనే నేర్చుకుంటాను !"

"పాపం ! ఆశ !"

"ఆశ కాబట్టే నీ సన్నిధిలో నన్ను నేను మర్చిపోతున్నాను! ఒక్కసారే నిన్ను! నిన్ను!..." విజయ జవాబు చెప్పబోయేంతలో ఛప్పున ఆమె బుగ్గమీద ముద్దుపెట్టుకున్నాడు.

"ఏమిటిది ? ఛీఛీ! యెవరయినా చూస్తే ఏమనుకుంటారు ?"

"పోనీ యెవరూ చూడకుండా ముద్దు పెట్టుకోనా ?"

"ఏ? వళ్లు యెలా వున్నది ?"

"అలజడి రేకెత్తించుతోంది. నీ పమిటికొంగుచాటున కాసేపు తలదాచుకోనా?"

"ఛీ! ఫో !"

చేతిలోని దువ్వెనతో శ్రీనివాస్‌ని కొట్టబోయి అద్దాన్ని కొట్టింది. అంటే ? తానింతవరకు ఊహల్లో! శ్రీనివాస్‌తో! ఎందుకిలా జరిగింది. తానెంత ద్వేషించుతున్నా తన మనసులోకి; ఊహల్లోకి వచ్చి అశాంతిని కలిగించుతున్నాడు. తాను వద్దనుకుంటున్నప్పటికీ తన ఊహలను వీడని శ్రీనివాస్‌ని తాను ప్రేమించటంలేదుకదా !

ఆ భావం విజయ మనసులోకి రావటంతోనే బరువుగా నిట్టూర్చింది. అత్తయ్యకి అదే ఉద్దేశ్యం వుండి తనను తీసుకువచ్చింది. రాను రాను శ్రీనివాస్ మీద ఆ భావం పోయింది విజయకి. అయినా అతన్ని గురించి ఆలోచించటం మానలేదు. "ఇది" అని మాత్రం నిర్ధారించుకోలేకపోయింది చివరికి...

రామనాథం ఆరోగ్యం పూర్తిగా బాగుపడింది. ఇంటికి వెళ్లమని డాక్టర్ చెప్పగానే బందిఖానాలో నుంచి విడుదల అయినంతగా సంతోషించాడు. అది గ్రహించిన డాక్టర్ నవ్వాడు.

"మీరు ఇంటికి వెళ్లినా చాలా జాగ్రత్తగా వుండాలి ! యెలాంటి వ్యాకులత చెందకూడదు!" అన్నాడు.

"మరీ ఇంతగా నిర్బధించతగదు డాక్టర్ గారూ !"

"మీ జబ్బు అలాంటిది ! మీకు చిన్నకోడలు వచ్చేవరకూ మిమ్మలను మీరు కాపాడుకోవటం మంచిదని నా సలహా !"

"మా చిన్నవాడికా ? చూస్తూ చూస్తూ యెవరూ పిల్లను ఇవ్వరు !"

"అదేమిటండి అలా అంటారు ? ఇంతకంటే రౌడీలకు, గజదొంగలకు పెళ్లిళ్ళు అవుతున్నాయి? ఏదో కుర్రతనంవల్ల ఆకతాయి పనులు చేసినంత మాత్రాన మీరంతగా బాధపడవలసిన అవసరం లేదు. మేము చదువుకున్నప్పటిరోజులలో కూడా సమ్మెలు; సత్యాగ్రహాలు చేసినవాళ్లమే ! మన రోజుల్లో కొంచెంగా చేశాం. ఇప్పటికి అప్పటికి కుర్రవాళ్ళల్లో తేడా లేదండీ ? ఇప్పటివాళ్లకి ఆవేశాలు యెక్కువ! అంతేనండీ! అంత మాత్రానికే బాధపడటం భావ్యంగా లేదు !"

"అలా చెప్పండి డాక్టర్‌గారూ ! అదేమంటే నేను గారాబంచేసి చిన్నవాడిని చెడగొట్టుతున్నానని నామీద కేకలువేస్తారు !" అంటూ వచ్చింది పార్వతమ్మ అక్కడికి !

"దేనికయినా ఒక హద్దూపద్దూ వుండాలి కదా ! మంచివాళ్లుగానే పేరు తెచ్చుకోవాలని నా తాపత్రయం !"

డాక్టర్ ఇంక ఆ సంభాషణను పొడిగించ దలుచుకోలేదు. మాలి సామాను డిక్కీలో సర్దేశానని చెప్పి వెళ్లిపోయాడు. చేతికర్ర ఊపుకుంటూ కారు దగ్గిరకు నడిచాడు రామనాథం. ఆయన్ని అనుసరించి పార్వతమ్మ డాక్టర్ కారు దగ్గిరకు వచ్చారు.



"బాగా మబ్బుపట్టింది డాక్టర్‌గారూ? మీరు స్కూటర్‌మీద వస్తే తడుస్తారేమో వర్షం కురిస్తే!"

"ఫరవాలేదులెండి. ఎండకి ఎండటం; వానకి తడవటం మా వృత్తి లక్షణం. మీరు బయలుదేరండి! మీ వెనుకనే నేను వస్తాను!"

కారు స్టార్టు అవటంతో ఆ వెనుకనే స్కూటర్ స్టార్టు చేశాడు డాక్టర్. కారు అటు వెళ్ళిన పది నిముషాలకి మరో కారు వచ్చి బంగళా ముందు ఆగింది అప్పటికే గాలీ వానా యెక్కువవటంతో డోరు తెరుచుకుని తొందరగా లోపలికి వెళ్ళింది విజయ. ఎప్పుడూ ముందు హాల్లో కూర్చునివుండే రామనాథం కనిపించక పోయేసరికి ఏమయ్యారా? అని అటు యిటు చూస్తుంటే శ్రీనివాస్ కూడా లోపలికి వచ్చాడు. గదిని చిమ్మి గొళ్ళెం పెడుతున్న మాలి వీళ్ళను చూసి దగ్గిరకు వచ్చాడు.

"ఓ అరగంట అవుతుందమ్మా బైలుదేరి! మీకు తెలియదా అమ్మా యింటికి బాబుగారు అమ్మగారూ వచ్చే సంగతి?"

"ఊహూం... మాటమాత్రంగానైనా చెప్పలేదు."

"నాకూ తెలియదమ్మా! డాక్టర్‌గారు యింటికి వెళ్లవచ్చునన్నారు. అనగానే ప్రయాణం అయ్యారు. లోపలికి రండమ్మా! తడిసిపోతున్నారు!"

మాలి హెచ్చరించగానే లోపలికివచ్చి జల్లు పడుతుంటే తలుపులు గెడ వేసింది విజయ.

"ఇప్పుడేమి చేద్దాం విజయా!" అనడిగాడు శ్రీనివాస్.

"చేసేదేమున్నది? తిరిగివెళ్లితేసరి!"

"ఇంత వర్షంలోనా? ఎలా వెళ్తారమ్మా! వర్షంపడితే దారంతా బురద! కారు వెళ్లటం కష్టం. దారిలో కారుకి ఏదయినా మీరు చాలా యిబ్బందిపడతారు. బాబుగారు భయపడుతునే బయలుదేరారు!"

ఇబ్బందిగా శ్రీనివాస్ వంక చూసింది విజయ. ఫరవాలేదన్నట్టుగా చూపులతోనే జవాబు ఇచ్చాడు.

"వర్షం తగ్గిన తరువాత డిక్కీలో వున్న పళ్లబుట్ట తీసుకొచ్చి లోపలపెట్టు మాలీ! నీళ్లు అన్నింటినిండా నింపివున్నావా బాత్‌రూంలో! గాలికి వర్షానికి కరెంటు పోతుంది. కొవ్వొవత్తులు యెక్కడ వున్నాయి?"

అయిదున్నరకే గాఢాంధకారం అలుముకున్నది. చీకటిలో వుండాలంటే విజయకి యెంతో భయం. ఇప్పుడు తిరిగి వెళ్లితే మధ్యదారిలో ఇరుక్కుంటే అదింకా ప్రమాదం! డ్రైవర్ లేకపోవటంవల్ల భాస్కర్ శ్రీనివాస్‌ని డ్రైవ్ చెయ్యమంటే కాదనలేకపోయింది. శ్రీనివాస్ రావటం విజయకి అసలు ఇష్టంలేదు. అందుకే దారిలోకూడా అతనితో ఏమీ మాట్లాడలేకపోయింది. తల తిప్పుకుని మరీ కూర్చుంది.

శ్రీనివాస్ కూడా విజయతో కసి అంత దూరం ప్రయాణం చెయ్యటానికి భయపడ్డాడు. విజయ అడిగే యక్షప్రశ్నలకు ఏమని జవాబు

# రాగబంధం

చెప్పకోవాలి? మేరీ ఎవరంటే? యెప్పటినుంచి పరిచయం? ఎందుకిలా యింటికి వస్తున్నది? అనడిగితే తనేమని చెప్పకుంటాడు? ఏ క్షణాన ఏం ప్రశ్నించుతుందోనన్న భయంతో తబ్బిబ్బులాడి పోయాడు. తోటని సమీపించగానే తేలికగా నిట్టూర్చాడు.

మాలి గది తలుపులు తీసి లైటు వేశాడు. డిక్కీలో వున్న పళ్లబుట్టను తీసుకొచ్చి లోపల పెట్టాడు తడవకుండా గోనెసంచిని తలమీద వేసుకున్నాడు.

"ఈపూటకి వంట ఏర్పాటుచెయ్యమంటారా అమ్మా?" మాలి అడిగాడు.

"అవసరంలేదు. పళ్లు వున్నాయి. పాలు వుంటే తీసుకురా!"

శ్రీనివాస్ గదిలోకి వెళ్ళి కిటికీ ఊచల్లో తల పెట్టుకుని బైటికి చూస్తూ నిలబడ్డాడు. కుండపోతగా వర్షం! వుండి వుండి మేఘగర్జన! మెరుస్తున్నది. పక్షుల కిచకిచలు! చల్లని వాతావరణం! మనసుకి ఆహ్లాదకరంగా వున్నట్టని




పించింది. స్నేహితులతో చాలాసార్లు తోటలోకి వచ్చాడుగాని ఇంత హాయి అనుభవించి వుండలేదు అనుకున్నాడు. తాము ఏ ఆకర్షణకూ లొంగకూడదు? అని మనసుని కట్టుదిట్టం చేసుకున్నాడు. అలా ఎంతసేపు నిలబడ్డాడో శ్రీనివాస్‌కే తెలియదు.

"చీకట్లో ఏం చూస్తున్నావు బావా?"

విజయ కంఠం విని ఛప్పున తల తిప్పి చూశాడు. చిన్నగా నవ్వుతూ నిలబడివున్నది. ఆ చిరునవ్వు చూడగానే పోయిన ప్రాణం లేచి వచ్చినట్లయింది. కిటికీ దగ్గిరనుంచి యువతలకి వచ్చి కుర్చీలో కూర్చున్నాడు నవ్వుకుంటూ;

"వంట ప్రయత్నం చెయ్యలేదు!"

"ఫరవాలేదు! నీకు లేని ఆకలి నాకు ఎక్కడ నుంచి వస్తుంది విజయా!"

"పోనీలే! నామీద కోపం తెచ్చుకోకుండా కరుణించావ్?"

విజయ అలా నవ్వుతూ మాట్లాడుతుంటే శ్రీనివాస్‌కి ఎంతో హాయిగా వున్నది! ఇలా విజయ ఎప్పుడూ తన కెదురుగా కూర్చుని నవ్వుతూ కబుర్లు చెప్పితే ఎంత బాగుండును? అనుకున్నాడు.

ప్లేటునిండా పళ్ళు; స్టీలు గ్లాసునిండా పాలు నింపుకుని గదిలోకి వస్తున్న విజయను చూస్తూ వుండిపోయాడు. విజయకి తనకీ వివాహమయి నట్టు మొదటి రాత్రి తెల్లని చీర కట్టుకుని అంతకంటే తెల్లని పాలు గ్లాసులో నింపుకుని గదిలోకి ప్రవేశించగానే గ్లాసు అందుకుని టీపాయ్ మీద వుంచి తన బిగికౌగిలిలో ఊపిరి ఆడకుండా బిగించుకున్నంత అనుభూతికి లోనయ్యాడు.

"విజయా!"

"ఏమిటి బావా!"

"అబ్బే! ఏమీలేదు!... ఏమీలేదు!" కలలో నుంచి యిహ లోకంలోకి వచ్చి తేరుకుని సర్దుకుని మరీ కూర్చున్నాడు.

ఎప్పుడూ పెద్దపులిలా అరుస్తూవుండే చినబావ పిల్లిపిల్లలా అయిపోయాడేమిటి? మాట్లాడటానికే భయపడిపోతున్నాడు? ఎందుకిలా మారిపోయాడో అర్థంకాలేదు విజయకి.

"పాలు చల్లారిపోతున్నాయి చినబావా! ముందు పళ్లు తిని పాలు త్రాగు! తరువాత మాట్లాడుకుందాం!"

విజయ వెళ్లిపోయింది. తరువాత మాట్లాడుకుందాం అనింది. ఏం మాట్లాడుతుంది? మేరీని గురించి అడుగుతుందేమో? అవును? తనదగ్గిరకు రెండవసారికూడా రావటం; తను డబ్బు యిచ్చి పంపటం చూసింది. మేరీ ఎవరని అడుగుతుంది! మేరీకీ నీకూ సంబంధం ఏమిటని అడుగుతుంది! ఈ ప్రశ్నలవర్షం నుంచి తాను తప్పించుకోవాలంటే ఒక్కటే మార్గం! తొందరగా విజయ యిక్కడనుంచి నిష్క్రమించితే బాగుణ్ణు! గాలి లేనట్టుగా షర్టు బటన్సు విప్పి కర్చీఫ్‌తో విసురుకో సాగాడు. అది గ్రహించిన విజయ చిన్నగా నవ్వుతూ ఫాన్ స్విచ్ ఆన్ చేసి వెళ్లిపోయింది.

ఆ రాత్రి ఎంతకీ నిద్రపట్టలేదు శ్రీనివాస్‌కి. సోఫాలో పడుకుని ఆదమర్చి నిద్రపోయింది విజయ. ఉరుములు మెరుపులతో వర్షం. మధ్య మధ్య ఈదురుగాలి! మనసంతా అలజడిగా వుంది. త్రాగాలనిపించింది. తను రహస్యమయిన అరలో బాటిల్సు దాచుకుని వుంచుకుంటాడు. అది యిప్పుడు త్రాగాలనిపించింది. త్రాగితే మేరీ కావాలనిపించుతుంది. తాను ఇప్పుడు వెళ్లలేడు. ఈ వర్షంలో యెలా వెళ్లగలడు?

విజయ!...

'అమ్మో! విజయా! ఆ తలంపే ఘోరమయినది! నిప్పుతో చెలగాటమాడినట్లే అవుతుంది. తాను తప్పుగా ఆలోచించుతున్నాడు? సిగరెట్టుమీద సిగరెట్టు కాల్చిపారేస్తున్నాడు. మనసు మందుమీద; శరీరం పొందు కోరుతున్నది! నిలువలేకపోతున్నాడు. సీసా తెచ్చుకోవాలన్నా అటువైపునుంచే వెళ్లాలి! నిశ్చలంగా ఒకపట్టాన కుర్చీలో కూర్చోలేకపోయాడు. గదిలో పచార్లు ప్రారంభించాడు. ఎప్పటికోగాని నిద్రపోలేక పోయాడు.

విజయ లేచేసరికి తెల్లవారిపోయింది. వర్షం గాలి విసురు బాగా తగ్గింది. చెట్లు కొన్ని నేలకి వరిగాయి. మరికొన్ని తలలు వాల్చాయి. ఆకులన్నీ రాలి నానాభీభత్సంగా తయారయింది తోట అంతాను. ఇప్పుడు బయలుదేరి వెళ్తేనేగాని

కాలేజీ టైంకి అందుకోలేదు తాను. శ్రీనివాస్ లేపిన అలికిడి లేకపోయేసరికి గదిలోకి వెళ్ళింది లేపేందుకు !

పడకకుర్చీలో పడుకునివున్నాడు ఆదమర్చి ! కుర్చీ చుట్టూ కాల్చిపారవేసిన సిగరెట్టుపీకలు చూసి ఆశ్చర్యపోయింది. అంటే రాత్రంతా జాగరణ చేశాడన్నమాట ! నిద్రపోకుండా యిన్ని సిగరెట్లు కాల్చిపారవేసేందుకు ఏం ఘనకార్యం వెలగబెట్టుతున్నాడని ?

"చినబావా ? చినబావా ?"

దూరంగా నిలబడి గట్టిగా పిలిచింది విజయ. అంత నిద్రలోనూ ఉలిక్కిపడి లేచి నిలబడ్డాడు శ్రీనివాస్ ! విజయ సీరియస్‌గా వుంటం చూసి తల వంచుకున్నాడు. అతని కళ్ళు జ్యోతుల్లా వుండటంతో దీర్ఘంగా నిట్టూర్చి బైటికి వెళ్ళింది. మరో అరగంటకి యిద్దర్నూ కారులో తిరుగుముఖం పట్టారు. ఇద్దరిమధ్యా యెలాంటి సంభాషణా లేదు. ఎవరిమట్టుకు వారు అలాగే మౌనం వహించారు.

## 17

విజయ కారు దిగి లోపలికి రాగానే పార్వతమ్మ ఆదరా బాదరా ఎదురు వెళ్ళి బుజాలమీద చేతులు వేసి దగ్గిరకు తీసుకుని కంగారుగా ప్రశ్నించింది.

"ప్రయాణం కులాసాగా జరిగిందా ? రాత్రి నిద్ర బాగా పట్టిందా ? అక్కడ వంటరిగా వుంటే బాధనిపించలేదా ? ?"

"అదేమిటత్తయ్యా ? కొత్తచోటికి వెళ్ళినట్టు; నేనేదో బాధపడిపోయినట్టు మాట్లాడుతారేమిటి ? వెంటనే తిరిగి రావాలనుకున్నాంగాని అంతకంతకూ ఎక్కువయింది గాలీ వర్షం — మామయ్యను చూడ్డాలని బైలుదేరితే డ్రైవర్ లేకపోతే చినబావని పంపించాడు పెదబావ ! వంటరిగా నేనెందుకు వున్నాను ? చినబావ వున్నాడుగా ! యింకేం భయం వుంటుంది అత్తయ్యా !"

"అంటే నీకేమీ కాలేదుగా ?"

"నాకేమవుతుంది ? అయినా అలా షికారుకి వెళ్ళినట్టు వెళ్ళాం. వచ్చాం. ఇంకేమవుతుంది చెప్పు యింతలో !"

రామనాథం దగ్గు గదిలోనుంచి వినపడేసరికి అటు వెళ్ళింది. హమ్మయ్య ! అనుకుని గుండెల మీద చేతులుంచుకుని తేలికగా నిట్టూర్చింది.

"ఏం మామయ్యా ? మీకోసమని వస్తే మీరు వచ్చేశారు ? అప్పుడే ఏం తొందర వచ్చిందని యింటికి వచ్చారు ? మరికొన్ని రోజులు అక్కడే విశ్రాంతి తీసుకుంటే మంచిదికదా ?" అనడిగింది విజయ నవ్వుతూ; రామనాథం సమాధానం చెప్పబోయేంతలో అక్కడికి వచ్చిన పార్వతమ్మ అందుకుంది —

"మీ మామయ్యకి తన ఆరోగ్యంకంటే వ్యాపారం — డబ్బు ముఖ్యం కదూ ? అందుకని వచ్చేశారు !"

"నన్ను అంటుందిగాని మీ అత్తయ్యకి మాత్రం లేదా ? చిన్న కొడుకుమీద బెంగ పట్టుకుందని నన్ను వచ్చేవరకూ తొందర చేసింది !" అన్నాడు భార్యవంక చూస్తూ !

"నన్ను అడ్డుపెట్టుకోనిదే మీకేమాటా రాదుగా ? మీకు పాలు తీసుకువస్తాను !"

అంటూ పార్వతమ్మ వెళ్ళిపోయింది బైటికి

"నాకూ కాలేజీ టైం అయింది మామయ్యా ! వస్తాను !"

అంటూ తన గదివైపుకి వెళ్ళింది విజయ. అప్పటికే శ్రీనివాస్ కాలేజీకి తయారయ్యాడు. స్కూటర్ స్టార్టు అయిన శబ్దం వినిపించి —

"అరే ! రోజూ నాకంటే ఆలస్యంగా వెళ్ళే బావ ఈ రోజు నాకంటే ముందే వెళ్తున్నాడే ? అనుకుంది విజయ. ఆ రోజు రోజూకంటే ఆలస్యంగా కాలేజీకి బైలుదేరింది. ఆ తేడాను రామనాథం గ్రహించగలిగాడు.

కాలచక్రంలో రోజులు వారాలుగా; వారాలు నెలలుగా ఇట్టే గడిచిపోయాయి సుందరి ఏకంగా ఆడపిల్లను యెత్తుకుని అత్తవారింటికి వచ్చింది. ఎర్రగా బొద్దుగా వుండే బేబీ అంటే విజయకి యెంతో ముద్దు. కాలేజీ నుంచి రాగానే బేబీతో కాలక్షేపం చేయటంలో విజయ టైం యిట్టే గడిచిపోతున్నది. ఫైనలియర్ ఎగ్జామ్సు అని పార్వతమ్మ మందలించినా పక్కన కూర్చోబెట్టుకుని అయినా తను చదువుకునేది.

విజయకి మరీ దగ్గిర అయిపోతున్నదని బేబీని దూరంగా వుంచాలన్నా సాధ్యంకావటంలేదు సుందరికి విజయ కాలేజీ నుంచి రాగానే తప్పటడుగులువేస్తూ చేతులు జాపుకుంటూ యెదురువెళ్ళేది భాస్కర్ కూడా ఆఫీసు పనిలో పూర్తిగా నిమగ్నుడై రామనాథానికి అండగా వుంటున్నాడు. శ్రీనివాస్ ప్రవర్తనలో కొంచెంగా మార్పు వచ్చింది. విజయ అంటే అంతగా కోపగించుకోవటంలేదు. కాని తన అవసరాలు బాగానే, తల్లిచ్చే డబ్బుతో, బైట తీర్చుకుంటూనే వుండేవాడు. మరీ ఈమధ్య తల్లిని యెక్కువ డబ్బు అడిగి తీసుకోవటంతో రామనాథం ఒకటికి రెండుసార్లు ఆఫీసు నుంచి వస్తూ శ్రీనివాస్ బార్‌లోకి స్నేహితులతో వెళ్లటం చూశాడు ఆ క్రితంరోజు ఇంటి ఖర్చులకని పార్వతమ్మకి యెక్కువ మొత్తమే యిచ్చాడు. అదేమయినా ఇచ్చిందా ? అన్న అనుమానం కూడా కలిగింది. వెళ్ళి చూడాలనిపించినా సభ్యత అడ్డువచ్చింది.

ఇంటికి రావటమే భార్యను పిలిచాడు అలవాటుప్రకారం మంచినీళ్ళు తీసుకుని వచ్చింది పార్వతమ్మ.

"నిన్న నీకు ఇచ్చిన రెండువేలూ తీసుకురా ?"

"ఎందుకండీ ? ..." కంగారుపడుతూ అడిగింది.

"చాలా అవసరం వచ్చింది. బాంకి టైం అయిపోయింది. కొంతమంది వర్కర్సుకి జీతాలు ఇవ్వవలసివున్నది. చాలా అర్జంటు !"

"చాలావరకు వాడేశానండీ ? నాలుగైదు వందలుంటాయి ఇవ్వమంటారా ?"

"మిగతా డబ్బంతా ఒక్కరోజునే ఖర్చు చేశావన్నమాట ?"

"విజయకి బట్టలు తీశాను లేవంటే ! వంటమనిషికి పనివాళ్ళకి అడ్వాన్సు జీతాలు ఇచ్చాను కాలేజీలో ఏదో ఫంక్షన్ చేయటానికి ఇవ్వాలని విజయ వంద తీసుకున్నది !"



విజయ



కథ-స్క్రీన్‌ప్లే-దర్శకత్వం:
తాతినేని రామారావు

నిర్మాత: వడ్డే శోభనాద్రి  నిర్వహణ: వడ్డే ర

మాధవి పిక్చర్స

ఈస్ట్‌మన్ కలర్



మేష్

Nandi

సంగీతం: జె.వి.రాఘవులు

ఫొటోగ్రఫీ: సెల్వరాజ్

ఆంధ్ర: అన్నపూర్ణ ఫిలింస్

నైజాం: శ్రీ తారకరామ సీడెడ్: నవభారత్

ANNAPURNA

"ఆఁ ... సరే! మరొకళ్ల దగ్గిర తీసుకుంటానులే !"

ఎంత హడావుడిగా వచ్చాడో అంతే హడావుడిగా బైటికి వచ్చి కారు ఎక్కాడు. కారు వేగంగా పోతుంటే కాలేజీ దగ్గిరకు రాగానే కారుని పక్కగా ఆపమన్నాడు తాను దిగి కారు దగ్గిరే నిలబడి విజయకోసం ఎదురుచూస్తున్నాడు స్నేహితురాళ్లతో

"అరుగో మీ మామయ్య!" అంది లక్ష్మి ఆ వైపుకి చూపించుతూ;

"ఏమిటి మామయ్యా! యిలా వచ్చారు ?" దగ్గిరకు వెళ్లి అడిగింది

"ముందు కారు ఎక్కు!"

విజయ మరేమీ మాట్లాడకుండా కారు ఎక్కింది విజయ పక్కనే కూర్చున్నాడు రామనాథం. డ్రైవర్‌తో పబ్లిక్ గార్డెన్ అని చెప్పాడు. అక్కడికి ఎందుకు ? అడగలేక పోయింది. కారుని పార్కింగ్ ప్లేస్‌లో ఆపాడు డ్రైవర్. రామనాథం ముందు దిగాడు ఆ తరువాత విజయ దిగి కారు దగ్గిరే నిలబడింది.

"రామ్మా! అలా వెళ్దాం!"

తను నడుస్తూ విజయను ఉద్దేశించి అన్నాడు. తల వంచుకుని ఆయన్ని అనుసరించి నడవసాగింది. అలా కొంతదూరం వెళ్లి యెవరూ లేరని నిర్ధారణ చేసుకున్న తరువాత ఆగిపోయాడు.

"నిన్నొక్కమాట అడుగుతాను. నాదగ్గిర ఏదీ దాచకుండా చెప్పతావుగా అమ్మా!"

## రాగబంధం

"చెప్పతాను మామయ్యా! మీకంటే కావలసినవాళ్లు నాకెవరున్నారు ?"

"మీ అత్తయ్య నీకు వందరూపాయలు ఇచ్చిందా ?"

"లేదే ?"

"బట్టలు కొన్నదా నిన్న!"

"లే! ... ఆఁ.. అవును మామయ్యా! అవును! కొన్నది! నాకసలు బట్టలులేవుగా ?" కంగారుని కప్పిపుచ్చుకుంటూ అంది.

"విజయా! నాగ్గిర అబద్ధంఆడనని చెప్పి చివరికి ఇదా నువ్విచ్చే సమాధానం ? నీ కంగారే నిజాన్ని నిరూపించుతోంది మీ అత్తయ్యకోసం నువ్వు అబద్ధంఆడుతున్నావని గ్రహించలేని మూర్ఖుడినిమాత్రం కాదమ్మా! నీకేమీ చీరలు కొనలేదు పాకెట్టుమనీగా ఎందకాదు నాలుగు రూపాయలు కూడా ఇచ్చివుండదు మీ అత్తయ్య అంటే నీకున్న అభిమానానికి చాలా సంతోషం మీ అత్తయ్యను వెనుకేసుకురావటంలో నీ ఉద్దేశ్యం మంచిదేగాని, అది శ్రీనివాస్ భవిష్యత్తు నాశనానికి దారితీస్తోంది చెప్పమ్మా! చెప్ప ? నీకేమీ కొనలేదుకదా ?"

"మామయ్యా ?"

"అవునమ్మా! శ్రీనివాస్ ప్రవర్తన నాకేమీ నచ్చటంలేదు వాడు చాలా చెడిపోయాడు అందుకు కారణం మీ అత్తయ్య ప్రేమేనమ్మా! అన్ని వ్యసనాలకీ బానిస అయ్యాడమ్మా!"

"... ... ..."

"వీడి చేష్టలను అరికట్టనూలేకపోతున్నాను గట్టిగా మీ అత్తయ్యనూ మందలించలేక పోతున్నాను. నువ్వు బాగా చదువుకుని వృద్ధిలోకి రావాలి! మీ అమ్మ ఋణం తీర్చుకోవాలంటే నీవు సుఖసంతోషాలతో కళకళలాడుతూవుండాలని నా కోరిక. మీ అత్తయ్య ఉద్దేశ్యం ఏమిటో నీకు తెలిసేవుంటుంది. నిన్ను ఈ యింటికోడలిగా చేసుకోవాలని! అది నా కిష్టంలేదమ్మా! వాడెలాగూ వ్యసనపరుడయ్యాడు. చూస్తూ చూస్తూ వాడికోసమని నీ బంగారు భవిష్యత్తుని నాశనం చేయలేను. నన్ను అర్థంకోసుకోమ్మా విజయా ?"

"అలాగే మామయ్యా! ఈ విషయంలో అత్తయ్యను మందలించకండి. చినబావను సరయినమార్గంలో పెట్టేందుకు ప్రయత్నించండి ప్రయత్నంమీద సాధించలేనిదంటూ ఏమీ వుండదు!"

"అలాగేనమ్మా! కాని వాడికి పెద్దలంటే గౌరవభావం లేదు. అతినిర్లక్ష్యం శ్రీనివాస్ ఒక వయస్సు వచ్చినవాడు తండ్రిగా నేను చెప్పి మందలించవలసిన టైం దాటిపోయిందమ్మా! నీవల్లనయినా కొంత మారుతాడనిపించేది అది కూడా కనిపించకపోయేసరికి పిల్లలమీద విరక్తి కలిగింది. అడ్డాలనాడు బిడ్డలుగాని గడ్డాలనాడు బిడ్డలు కాదనిపించుతోంది!"

"మీరలా బాధపడకండి మామయ్యా! మీరు ఊహించినంత దుర్మార్గం చినబావలో లేదు! అలవాటులంటారా ? అతను తిరిగే వాతావరణం అలాంటిది. అతని స్నేహితులుకూడా అలాంటివారే! కొంతకాలం ఆ వాతావరణానికి ఆ స్నేహితులకు దూరంగా వుంచితే మార్పు కనిపించవచ్చు!'

"అని నువ్వనుకుంటున్నావు ? అది జరగని పని విజయా! నాలుగుగోడలమధ్యా పిల్లిని బంధించి కొట్టబోతే ఎదురుతిరుగుతుందమ్మా!"

"మీరు చినబావని గురించి ఒకేవిధంగా ఆలోచించుతున్నారుగాని మరొకరకంగా ఆలోచించితే అదేమంత కష్టమనిపించదు బావ విషయంలో!"

"పిచ్చితల్లీ! మీ అత్తయ్యలాగే నువ్వూ వాడిని గురించి ఒకేవిధంగా ఆలోచించుతున్నావే ? ఎంతయినా మేనత్త మేనకోడలుకదూ ? అయినా శ్రీనివాస్ గురించి నాకంత మంచి అభిప్రాయం లేదు!"

విజయ మౌనం వహించింది. శ్రీనివాస్ గురించి ఆలోచించసాగింది. తోటలో రాత్రి నిద్రపోకుండా సిగరెట్టుమీద సిగరెట్టు కాల్చిపారవేసిన సంఘటన గుర్తుకువచ్చింది.

"పదమ్మా వెళ్దాం!"

రామనాథం ముందు నడుస్తుంటే వెనుకనే విజయ అనుసరించివచ్చి కారులో కూర్చుంది విజయను ఇంటివద్ద దింపి తను ఆఫీసుకి వెళ్లిపోయాడు తిరిగి. అది చూసిన పార్వతమ్మ దడదడలాడిపోయింది. తాను ఆడిన అబద్ధం



బయటపడిందేమో? కాలేజీ నుంచి వచ్చేటప్పుడు బస్సులోనో రిక్షాలోనో వచ్చేది. ఈరోజు భర్త కాలేజీకి వెళ్ళి విజయను వెంటబెట్టుకునివచ్చి ఇంటివద్ద దింపి వెళ్ళటంలో గల అంతరార్థం అర్థంఅయింది. విజయ లోపలికి వస్తూనే మేనత్తను చూసి చిన్నగా నవ్వింది. రోజూలాగా చిరునవ్వే జవాబుగా ఇవ్వలేకపోయింది. తొందరగా అక్కడనుంచి లోపలికి వెళ్ళిపోయింది. బేబీ బొమ్మలతో ఆడుకుంటువున్నదల్లా విజయను చూడగానే ఎత్తుకోమని చేతులు జాపింది. బేబీని ఎత్తుకుని తన గదిలోకి వెళ్ళిపోయింది.

[ఇంకా వుంది]

### అభిమాన త్రయం నటిస్తున్న చిత్ర తోరణం

ఆంధ్ర ప్రేక్షకుల అభిమానాన్ని అనతికాలం లోనే ఆర్జించిన ముగ్గురమ్మాయిలు యిప్పుడున్న చిత్రాలలో ఎక్కువ తమవిగా అనుభవిస్తున్నారంటే, దానికి కారణం మీరే

మీ అభిమాన తారలుగా ప్రకాశిస్తున్న జయప్రద జయసుధ జయచిత్రలకు మరో ఐయిదేండ్లు బలమైన స్థానం వుండడానికి వలసిన వాతావరణం పరిశ్రమలో నెలకొన్నట్టు ధైర్యంగా వ్రాయొచ్చు

ఈ ముగ్గురు సంవత్సరానికి ఏడెనిమిది చిత్రాలలో (కనీసం) నటిస్తారు గనక వాటిలో రెండు చిత్రాలు శతదినోత్సవ చిత్రాలుగా వుంటాయి గనక మళ్లీ నిర్మాణం అయ్యే చిత్రాలలో తప్పక స్థానబలాన్ని పొందడం తథ్యమే గదా!

ఇప్పుడున్న "జయత్రయం" పేరులో "ఎక్కరీ"ని పొందియుండడంవల్ల, వారి ప్రవర్తన, నటన మెచ్చదగినదిగా వుండడంవల్ల, భవిష్యత్తు జోరుగా సాగే అవకాశం వుందని ఘంటాపదంగా చెప్పొచ్చు

"జయ"లకు మన కథానాయకుల ప్రోత్సాహం కూడా వుండడంవల్ల, ప్రేక్షకులు అత్యధికంగా ప్రేమించే తమ నాయకుల సరసన నటించే నటీమణులకు రాబోయే ఏళ్ళరాలు విజయాన్నే సూచిస్తున్నాయి

"జయత్రయం" నటిస్తున్న చిత్రాలెన్ని అనేది వివరాలను ఈ వారం ప్రత్యేకంగా పాఠకులకు తెలపమంటారా?

#### జయప్రద

"అడవిరాముడు" చిత్రం అఖండ విజయాన్ని సాధించడం, జయప్రదకు ఎక్కువ మేలు చేసింది





'అనుగ్రహం'లో స్మితాపాటిల్

##  సినిమా విశేషాలు 

ఆ చిత్రంలో ఆమె దివిసుందరిగా కనిపించి ప్రేక్షకుల స్వప్నసుందరి అయ్యింది అందుకనే, యిప్పుడు జయప్రదను మన నిర్మాతలు గ్లామర్ పాత్రలకే ఎంపిక చేస్తున్నారు ప్రస్తుతం నిర్మాణంలో వున్న చిత్రాలలో ఎక్కువ శాతం పంచుకున్నది కూడా జయప్రద అని చెప్పొచ్చు

మారుతీ కంబైన్స్ గోపాలకృష్ణగారు నిర్మిస్తున్న "అల్లరి బుల్లోడు" వర్ణచిత్రంలో హీరో కృష్ణ సరసన, కౌముదీ పిక్చర్స్ ఎమ్ ఎస్ రెడ్డిగారు తీస్తున్న "నాయుడు బావ" చిత్రంలో శోభన్‌బాబు సరసన జయప్రద నాయికగా నటిస్తున్నది

శ్రీ ఎన్టీఆర్‌తో పుండరీకాక్షయ్యగారి "మేలుకొలుపు", శ్రీ అక్కినేనితో దాసరిగారి "దేవదాసు మళ్లీ పుట్టాడు" జయప్రద నటిస్తున్న భారీ వర్ణ చిత్రాలు

జయప్రద నటిస్తున్న కొత్త చిత్రాలు శ్రీ ఎస్ డి లాల్ దర్శకత్వంలో, శ్రీ ఎన్టీఆర్ నటిస్తున్న "రాజపుత్ర రహస్యం", శ్రీ బాపయ్య దర్శకత్వంలో శ్రీ రామారావు నటిస్తున్న "యుగపురుషుడు", శ్రీ రాజేంద్రప్రసాద్ దర్శకత్వంలో శ్రీ నాగేశ్వరరావు నటిస్తున్న "రామకృష్ణులు", శ్రీ దాస్ దర్శకత్వంలో శ్రీ కృష్ణ నటిస్తున్న త్రిమూర్తి ప్రొడక్షన్స్ కొత్త చిత్రం ఇవిగాక ప్రముఖ దర్శకుడు శ్రీ బాలచందర్ దర్శకత్వంలో కమలహాసన్‌తో రెండు చిత్రాలు

#### జయసుధ

తెలుగు చిత్రరంగానికి ఒక దిట్టమైన "వాంప్" దొరికింది అని అందరూ సంతోషిస్తున్న సమయాన, "లక్ష్మణరేఖ" చిత్రం వచ్చి, తను అగ్రశ్రేణి నాయిక కాగలను అని నిరూపించిన తారే జయసుధ ఆ తరువాత చిత్రాలలో "జ్యోతి" జయసుధ నట జీవితంలో మధురానుభూతిని యివ్వగలిగింది



'ప్రయాణంలో పదనిసలు'లో జయచిత్ర

"సూపర్‌స్టార్" శ్రీ ఎన్టీఆర్‌తో జయసుధ నాయికగా నటించే అవకాశాన్ని, జగపతి అధినేత కలిగించారు. ఆయనతో ఇంతకుముందు నటించిన చిత్రాలలో జయసుధ రెండో పాత్రను పోషించింది.

శ్రీ రాఘవేంద్రరావు దర్శకత్వం నిర్వహించనున్న శ్రీ అన్నపూర్ణా సినీ ఎంటర్‌ప్రైజెస్ వారి కొత్త చిత్రంలో శ్రీ నాగేశ్వరరావుతో నాయికగా నటించగలదని తెలిసింది.

ఉమాలక్ష్మి కంబైన్స్ వారి "విచిత్ర జీవితం" లో జయసుధ రెండో నాయికగా నటిస్తున్నది.

శ్రీ శోభన్‌బాబుతో రెండు చిత్రాల నాయికగా జయసుధ నటిస్తోంది. (నాయుడు బావ... డి. వి. ఎస్. రాజుగారి చిత్రం.)

జయసుధ కృష్ణగారితో నటించదా అని ఎందరో అడుగుతున్నారు. బహుశా కొత్త సంవత్సరంలో "కృష్ణ సుధ" ల చిత్రం ప్రారంభమవుతుందేమో !

పైన చెప్పినవిగాక "మొరటోడు, భాగ్యనగర్ స్టుడియో చిత్రం, ముగ్గురు మూర్ఖురాళ్ళు, యుగపురుషుడు" మున్నగు చిత్రాలలో జయసుధ ప్రాముఖ్యతగల పాత్రలను పోషిస్తున్నది.

## జయచిత్ర

తమిళ చలనచిత్ర రాజ్యంలో రాణివాసాన్ని అనుభవించిన తెలుగు అమ్మాయి జయచిత్రను, సురేష్ రామానాయుడుగారు "సోగ్గాడు" చిత్రం ద్వారా తెలుగు ప్రేక్షకులకు పరిచయం చేశారు. శ్రీ దాసరి రూపొందించిన "యవ్వనం కాటేసింది" చిత్రం జయచిత్రను ఒక ఉత్తమశ్రేణి నటిగా అంగీకరింపచేసింది.

శ్రీ ఎన్టీఆర్‌తో "మాదైవం" చిత్ర నాయికగా నటించిన జయచిత్రకు, శ్రీ అక్కినేనితో నటించాలన్న కోర్కె ఏర్పడింది. ఆమె కోరికను నిర్మాత శ్రీ వడ్డె రమేష్ "ఆత్మీయుడు" చిత్రం ద్వారా తీర్చగలిగారు.

"సోగ్గాడు" చిత్రం ఘనవిజయాన్ని సాధించినప్పుడు, "శోభన్ జయచిత్ర" ల కాంబినేషన్‌లో ఎక్కువ చిత్రాలను ప్రేక్షకులు ఎదురుచూశారు. కానీ, అలాంటి సంఘటన జరగడానికి లక్ష్మి ఫిలింస్ కంబైన్స్ నిర్మాత అనురాధాదేవిగారు పూనుకోవాల్సి వచ్చింది. ఇప్పుడు ఆమె "మంచిబాబాయ్" లో కూడా శోభన్‌కు సరసాంగిగా నటిస్తున్నది.

మాస్ హీరో కృష్ణగారితో జయచిత్ర మూడు చిత్రాలలో నటిస్తున్నది. సారథీ స్టుడియోస్ కొత్త చిత్రం, ప్రసన్నలక్ష్మి పిక్చర్స్, లక్ష్మినారాయణ కంబైన్స్.

ఇవిగాక "కటకటాల రుద్రయ్య, ప్రయాణంలో పదనిసలు" చిత్రాలలో జయచిత్ర నటిస్తోంది. ఇటీవల విడుదలయిన దాసరిగారి "చిల్లరకొట్టు చిట్టెమ్మ" చిత్రం జయచిత్ర తారాబలాన్ని బలీయం చేసింది.

"జయత్రయం" కలిసి నటించే ఒక చిత్రాన్ని, మీ అభిమానాన్ని చూరగొన్న ఒక విఖ్యాత నిర్మాత నిర్మించబోతున్నారు.

## ఊటీలో శోభన్ సుధల హనీమూన్

హైదరాబాదులో "మొరటోడు" చిత్రం కోసం జయసుధ, "మంచిబాబాయ్" చిత్రం కోసం శోభన్‌బాబు పక్షంరోజుల గడిపి రాత్రి కలిసి హనీమూన్‌కు పయనం అయ్యారు, ఊటీకి.



అక్కడ పదిరోజులుండి, అందమైన ప్రదేశాలలో మైమరచి, అదమరచి శృంగార సామ్రాజ్యాన్ని పరిపాలించి వచ్చారు. డి. వి. ఎస్. రాజుగారి కొత్త చిత్రానికని.

నవంబర్‌లో జరిగిన షెడ్యూలుతో, చిత్రం రెండువంతులు పూర్తయినట్టుగా పాఠకులకు తెలపమన్నారు, నిర్మాత శ్రీ డి. వి. ఎస్. రాజు.

"అవార్డుల దర్శకుడు" శ్రీ విశ్వనాథ్ నుంచి వస్తున్న కొత్త తరహా చిత్రంలో సత్యనారాయణ, రావుగోపాలరావు, మాధవి, భీమరాజు, మరియు అల్లురామలింగయ్య ముఖ్య పాత్రలను పోషిస్తున్నారు.

జనవరి, ఫిబ్రవరి నెలల్లో జరిగే ఇన్‌డోర్‌తో షూటింగు పూర్తవుతుంది.

## పదిలంగా దాచుకుంటా

ఇది సినిమా పేరు కాదు. "సూపర్‌స్టార్" శ్రీ ఎన్టీఆర్ సత్య చిత్ర వారి "అడవిరాముడు" ద్విశతదినోత్సవం రోజున తన అభిమానులను ఉద్దేశించి అన్న మాట.

ఆ చిత్రం తాలూకు 200 రోజుల పండుగ శ్రీ రాజకపూర్, శ్రీ శివాజీగార్ల ఆధ్వర్యంలో ఎంతో వైభవంగా జరిగింది. శ్రీ డి. వి. ఎస్. రాజు, అలీగార్లు ప్రత్యేక ముఖ్య అతిథులుగా సభను అలంకరించి, సత్య చిత్ర అధినేతల సాహిత్యాన్ని గూర్చి, వారి చిత్రాన్ని గూర్చి ప్రశంసించారు.

'స్వర్గసీమ'లో మంజుల



లక్ష్మీ ఫిలింస్‌లో తను నటించిన మొదటి చిత్రం 'ఎదురులేని మనిషి, తరువాతి చిత్రం అడవిరాముడు, మూడో చిత్రం యమగోల ఒకదాంతో మరొకటి పోటీపడి ఘనవిజయాన్ని సాధించి, ఆ సంస్థ అధినేత శ్రీ కె. ఎల్. ఎన్. ప్రసాద్‌తో మధురమైత్రికి దోహదం చేశాయి అని శ్రీ ఎన్టీఆర్ అన్నప్పుడు ప్రేక్షకుల ఆనంద ధ్వనులు సభను మారుమోగించాయి.

"రాఘవేంద్రరావు లాంటి ఆవేశం, ఉద్వేగం వున్న ప్రతిభావంతుల అవసరం మన పరిశ్రమకు చాలా అవసరం" అని శ్రీ ఎన్టీఆర్ అన్నప్పుడు సభ కరతాళ ధ్వనులతో అభినందించింది.

## రగిలే హృదయం!

హిందీ చిత్రం "సమాధి" ఆధారంగా, లక్ష్మి ఫిలిమ్స్ కంబైన్స్ రంగుల్లో నిర్మించిన యాక్షన్ థ్రిల్లర్‌కు "రగిలే హృదయం" అని నామకరణం చేసినట్లు, నిర్మాత అనురాధాదేవి చెప్పారు

ఈ చిత్రానికి "నిండుమనిషి, నా ప్రాణంలో ప్రాణం" అనెడి పేర్లతో లోగడ పత్రికా ప్రచారం జరిగింది

ఒక మంచి కథ దొరికినప్పుడు దానికి సరిపడే మకుటం దొరకడం ఆలస్యమవుతుంది

ఆలస్యమయినా, కథానుగుణమైన మకుటం అన్ని చిత్రాలకు లభించదు

దర్శకుడు శ్రీ ఎస్ డి లాల్, రచయిత శ్రీ గొల్లపూడి, నిర్మాత అనురాధా దేవి, కథ నాయకుడు శ్రీ శోభన్ గార్లందరికీ నచ్చిన ఈ మకుటం పట్ల ప్రేక్షకులు ఆదరణ వర్షం కురిపించగల దమ్ము చిత్రానికి వుంది

"రగిలే హృదయం" చిత్రాన్ని అవుట్ సైడర్స్ కొందరు చూసి ఎంతిమ పాకంతో పోల్చారు ఇలాంటి చిత్రాలు తీయడంలో శ్రీ లాల్ అగ్రగామి అని అన్నారు లక్ష్మీకటాక్షాన్ని యిచ్చే చిత్రం "రగిలే హృదయం"

శోభన్‌బాబు గారి "నటన" అనూహ్యంగాను, అద్వితీయంగాను వున్నదని అందరూ ఏకగ్రీవంగా వక్కాణించారు

ప్రతినాయకుడుగా (పురిరాజా) సత్యనారాయణ చిత్రానికి ఎంతో బలాన్ని చేకూర్చిన విజాన్ని ప్రేక్షకులు వొప్పుకున్నారు

శృంగార నాయికగా దీప, కరుణరసానికి ప్రతిరూపంగా జయచిత్ర, రాజమాతగా జి వరలక్ష్మి సహజంగా నటించారన్నది వారివాక్కు శ్రీ గుమ్మడి గంభీరత, రాజబాబు మాడాల విదూషకత చిత్రంలో చెప్పుకోదగిన అంశాలు

సాంకేతికరీత్యా చూస్తె బాలకృష్ణ ఛాయాగ్రహణానికి మొదటి మార్కు యివ్వక తప్పుతుందా అన్నారు, అవుట్‌సైడర్స్

అందరినీ ఆకట్టుకోగలదన్న నమ్మకాన్ని వెల్లడించారు, చిత్రాన్ని చూచిన విమర్శకులు ఈ చిత్రాన్ని ఆంధ్రాలో పూర్ణా, నైజాంలో ఉషా ఫిలింస్ విడుదల చేస్తారు

కాలాబాజీ లో అంబికాసోనీ

# సినిమా

## నటరత్నవి రెండు జానపదాలు

జానపదాల నాయక శ్రేష్టుడుగా ప్రేక్షకుల ప్రశంసల నందుకున్న శ్రీ ఎన్టీఆర్ జానపదాలలో నటించి చాలారోజులయ్యింది

ప్రజలు ఆయన్ను ఏకైక నాయకుడుగా అంగీకరిస్తున్న ఈ అదన్ను యిద్దరు నిర్మాతలు అవకాశంగా తీసుకుని, రెండు భారీ చిత్రాలను తలపెట్టారు

జయలక్ష్మి మూవీస్ వారి జానపదానికి శ్రీ ఎస్ డి లాల్, తిరుపతి ప్రొడక్షన్స్ వారి జానపదానికి శ్రీ రాఘవేంద్రరావు దర్శకులు

మొదటి చిత్రం పేరు "రాజపుత్ర రహస్యం" జయప్రద నాయిక రెండో చిత్రం పేరు "కంచుకాగడా" అగ్రనటి వాణిశ్రీ నాయిక

రెండు జానపదాలలో అనూహ్యమైన వైవిధ్యం వుండడంవల్లనే, శ్రీ ఎన్టీఆర్ రెండు చిత్రాలకు తన ఆమోదాన్ని తెలిపారు

'నాయుడుబావ'లో శోభన్‌బాబు



### ఎన్టీఆర్ కొత్త చిత్రాలు

''సూపర్‌స్టార్'' శ్రీ ఎన్టీఆర్ నటిస్తే, ఆ చిత్రానికి బంగారుపంట తథ్యము అని ప్రేక్షకులు యిస్తున్న తీర్పును, నిర్మాతలందరు వుపయోగించుకోవాలని వుబలాటపడుతున్నారు. అందరినీ తృప్తిపరచడం ఆయనకు అసాధ్యమేమరి.

నవశక్తి శ్రీ గంగాధరరావుకు, వైజయంతీ మూవీస్ శ్రీ అశ్వినీదత్తుకు, జయలక్ష్మి మూవీస్ శ్రీ నాయుడమ్మకు, తిరుపతి ప్రొడక్షన్స్ శ్రీ డాక్టర్ రాజుకు, శ్రీ దయూసాగర్‌కు ఎన్టీఆర్ గారు కొత్త సంవత్సరంలో కాల్‌షీట్లు ఇచ్చినట్లు తెలుస్తూంది.

శ్రీ రామారావు ... శ్రీ నాగేశ్వరరావు కలిసి నటిస్తున్న జగపతి రాజేంద్రప్రసాద్ గారి ''రామకృష్ణులు'' జనవరి యిరవైన ప్రారంభం అవుతుందని పాఠకులకు తెలుసు. భాస్కర చిత్ర పుండరీకాక్షయ్యగారి ''మేలుకొలుపు'' చిత్రం పూర్తయినట్లు ప్రేక్షకులకు తెలుసు.

---

## టూకీగా టాకీ న్యూస్

★ విజయ మాధవీ పిక్చర్స్ అక్టోబర్ 7 న రెండు చిత్రాలను రిజిస్టర్ చేశారు. ఒక చిత్రం పేరు ‘‘కటకటాల రుద్రయ్య.’’ శ్రీ దాసరి దర్శకుడు. కృష్ణ ద్విపాత్రాభినయం.

రెండో చిత్రం పేరు ‘‘కొంటెకుర్రాడు.’’ శ్రీ తాతినేని దర్శకుడు. ‘‘నటసామ్రాట్’’ నాయకుడు. రెండింటినీ శ్రీ వడ్డె శోభనాద్రి నిర్మిస్తారు, సినిమాస్కోప్‌లో.

★ డిశంబర్ ఒకటిన ‘‘ఆత్మీయుడు’’ వర్ణ చిత్రాన్ని విడుదల చెయ్యడానికి, విజయ మాధవీ పిక్చర్స్ అధినేతలు నిర్ణయించారు. ఈ వర్ణ చిత్రానికి తాతినేని రామారావు కథ, సినిమా అనువాదం, దర్శకత్వం నిర్వహించారు. కుటుంబ గాధా చిత్రంగా, మాస్ అప్పీలు వున్న చిత్రంగా ‘‘ఆత్మీయుడు’’ రూపం దిద్దుకుంది.

★ నిరుద్యోగ సమస్యను కథాంశంగ తీసుకుని. దానిపై ఒక ప్రయోజనాత్మక చిత్రాన్ని నిర్మించడానికి, అగ్రదర్శకుడు శ్రీ దాసరి విర్ణయించారు.

తారకప్రభు బ్యానర్‌పై నిర్మింపబడే ఈ చిత్రానికి ‘‘ప్రశ్న’’ అని పేరిడబోతున్నట్టు దర్శక ... కథకుడు శ్రీ దాసరి చెప్పారు.

★ లక్ష్మిజ్యోతి ఫిలింస్ నిర్మాతల్లో ఒకరయిన శ్రీ రాజు తరువాతి చిత్రాన్ని ‘‘నటరత్న’’ గారితో నిర్మించాలని వున్నారు.



‘పంతులమ్మ’లో దీప

★ ఆదిత్య చిత్ర శ్రీ రాజేంద్రకుమార్ శ్రీ రామారావుతో నిర్మించబోయే చిత్రానికి బాపయ్యగారిని దర్శకుడుగా ఎంపిక చేసినట్టు వార్త.

★ ఉమాలక్ష్మి కంబైన్స్ రంగుల్లో నిర్మిస్తున్న ‘‘విచిత్ర జీవితం’’ చిత్రాన్ని సంక్రాంతి పర్వదినాన విడుదల చేసే వుద్దేశ్యం నిర్మాతలకు వుంది. ఈ చిత్రానికి వి. మధుసూదనరావు దర్శకుడు.

★ శ్రీ వై. వి. రావ్ ‘‘రోటీ, కపడా అవుర్ మకాన్’’ చిత్రాన్ని లాల్‌గారి దర్శకత్వంలో నిర్ణయించారు. శ్రీ ఎన్టీఆర్, కృష్ణంరాజు, కమల్ మూడు ప్రధాన పాత్రలను పోషించగలరని తెలిసింది.

★ ఇప్పుడు నిర్మాణంలో వున్న చిత్రాలలో ఎక్కువ చిత్రాల నాయికగా నటిస్తున్నది ఎవరో తెలుసా ? జయప్రద.

★ శ్రీ శంకరరెడ్డి నిర్మిస్తున్న ‘‘సతీసావిత్రి’’ వర్ణచిత్రం డిశంబర్ 23న విడుదల. శ్రీ బి. ఏ. ఎస్. కు ‘‘భీష్మ’’ నాటి పేరును కొత్త సావిత్రి తెచ్చిపెట్టగలదు.

—శ్రీనివాస్ ★

‘ఆత్మీయుడు’లో మురళీమోహన్, జయమాలిని

# హార్లిక్స్

Horlicks
THE IDEAL FOOD DRINK

## ఆరోజుకు ఆరోజు రోగనివారణ శక్తిని పెంచి ఆరోగ్యాన్ని కాపాడే పౌష్టికాహారం.

హార్లిక్స్ నిత్యం సేవించినట్టయితే, మీ కుటుంబానికి రోగాలు రాకుండాతట్టుకునే శక్తి పెరుగుతుంది. వారికి సంపూర్ణ-మయిన ఆరోగ్యం చేకురుతుంది. ఆరోగ్యం మహాభాగ్యం.

హార్లిక్స్, ప్రపంచం అంతటా డాక్టర్‌లు సిఫార్సు చేసేది ఇది ఒక్కటే, మీకు అత్యధికంగా పుష్టి ఇచ్చేది ఇది ఒక్కటే ఎందుచేతనంటే ఇందులోను సంపన్నమయిన స్వచ్ఛమయిన పదార్థలు; అపూర్వమయిన హార్లిక్స్ పద్ధతి ప్రకారం సమ్మిశ్రితమితాయి దీనివల్ల వీటి సహజ సద్గుణాలు నష్టంకావు. అవి సులువుగా జీర్ణం అవుతాయి.

అందువల్లనే సుచిత్ర హార్లిక్స్‌ని తన కుటుంబ జీవితంలో భాగంగా చేసుకుంది

సుచిత్ర మోస్తరుగానే మీరుకూడా మీకుటుంబానికి ప్రతిరోజు హార్లిక్స్ ఇవ్వండి వారు ఆరోగ్యంగా, బలంగా పెరగడం మీకు కనబడుతుంది.

“హార్లిక్స్ ప్రధానమయిన పుష్టి సాధనం. మీకుటుంబంలోనివారికి వ్యాధులు రాకుండా తట్టుకునే శక్తి పెరిగేందుకూ వారు ఆరోజుకారోజు ఆరోగ్యంగా, చురుగ్గా ఉండేందుకూ నేను హార్లిక్స్‌ను సిఫారుసు చేస్తున్నాను”



**హార్లిక్స్** మంచి పుష్టికరమైనది

హార్లిక్స్ రిజిష్టర్డ్ ట్రేడ్ మార్క్.

# జి. వి. జి. పేజీ

## నిర్మాత నిస్పృహ

"కొత్త ముఖాలు కావాలి, కొత్త కథలు కావాలి — అని ఘోషిస్తారే తప, మన ప్రేక్షకులు మారనంత కాలం — ఉత్తమ చిత్రాలు రావడం లేదంటే ఎలా వస్తాయండి? 'ఊరుమ్మడి బతుకులు, తరం మారింది' ఎంత చక్కని చిత్రాలు! వాటికి తగినంత ఆదరణ లేకపోబట్టే కదా యితర నిర్మాతలు అటు దృష్టి పోనివ్వక — మామూలు ఫార్ములా చిత్రాల మీదే దృష్టి కేంద్రీకరించడం? ఇక మన ప్రేక్షకులను మార్చడమంటే ఎలా? వీళ్ళు మారరండి. వీళ్ళు మారనంతవరకు కొత్తదనం గల చిత్రాలు రావు. వీళ్ళకు ఒకే మూసలో తయారు చేసినటువంటి చిత్రాలే కావాలండి. అలాంటి చిత్రాలకే అలవడిపోయారు. చూడండి... ఇద్దరన్నదమ్ములు వుంటారు. పరిస్థితుల ప్రభావంవల్ల బాల్యంలో ఇద్దరూ విడిపోతారు. చెరొక వాతావరణంలో పెరుగుతారు. ఒకడు గజదొంగ అవుతాడు. మరొకడు పోలీస్ ఆఫీసర్ అవుతాడు. ఇద్దరూ కలిసి జయప్రదనో, జయచిత్రనో, జయసుధనో ప్రేమిస్తారు. చివరికి యిద్దరికీ ఫైటు. మధ్య అడ్డుపడిన తల్లికి చావుదెబ్బలు తగులుతాయి. ఆమె గుటుక్కుమనడానికి ముందు వాళ్ళిద్దరూ తన కన్నబిడ్డలే అన్న రహస్యం బయటపెట్టేస్తుంది. దుష్టశిక్షణ, శిష్టరక్షణ జరగాలి గనుక గజదొంగకు జైలు పాప్తి, పోలీస్ ఆఫీసర్‌కు మెడల్, హీరోయిన్‌తో వివాహం... ఇదే కథను సంఘటనలు మార్చి, కొత్త ఫైట్సు, కొత్త డాన్సులు పెట్టి, కథనంలో మాత్రం కాస్త కొత్తదనం చూపించి ఎన్ని పిక్చర్లుగానయినా తీయండి. చూస్తారు. కాని, మలయాళం, కన్నడ భాషల్లో విప్లవాత్మకమైన, విశిష్టమైన చిత్రాలు తీయండి. ఆ ప్రాంతాలవారు ఎంత బాగా ఆదరిస్తారో!" అని ఓ నిర్మాత యిటీవల వెలిబుచ్చిన అభిప్రాయంలో ఎంత సత్యముందో అందరూ ఎరిగినదే!

## బి. ఎన్. గారి ఛలోక్తులు

కీ. శే. బి. ఎన్. రెడ్డిగారు తీసిన "బంగారు పాప" చిత్రాన్ని విఖ్యాత వంగ దర్శకుడు దేవకీబోస్ మెచ్చుకొని, ఆ చిత్రాన్ని బెంగాలీ భాషలో తీశారు. కాని, అక్కడ కూడా యిక్కడిలాగే ఆ చిత్రం ఆర్థిక విజయం పొందలేకపోయింది. ఆ సంగతి తెలిసి బి.ఎన్. "దురదృష్టం అంత దూరం ప్రయాణిస్తుందనుకోలేదు" అని ఛలోక్తి విసిరారు. రాజ్‌కపూర్ "జాగ్‌తేరహో" చిత్రం ప్రత్యేక ప్రదర్శనానంతరం బి. ఎన్. ను అభిప్రాయమడిగితే, "ఇది కళాఖండం" అన్నారు. "కాని, డబ్బు చేసుకుంటుందన్న నమ్మకం లేదు" అని రాజ్‌కపూర్ తన సందేహాన్ని వెలిబుచ్చితే, "ఈ సంప్రదాయం మీరు సృష్టించిందే కదా? ఇన్నాళ్ళూ మీ చిత్రాలనిండా ఐరన్ లవ్ ప్రదర్శించారు. ఈ చిత్రంలో కూడా అదే చూద్దామని వస్తారు జనం. నిరాశ చెందుతారు గనుక డబ్బు రాదు" అన్నారు బి.ఎన్. నిష్కర్షగా. రాజ్‌కపూర్ ఏకీభవించక తప్పలేదు.

సరికొత్త భావాలతో "మేరా నామ్ జోకర్"ను రాజ్‌కపూర్ అత్యుత్తమమైన కళాఖండంగా తీసి, ఎంతో నష్టాన్ని కొని తెచ్చుకున్నాడు. దాంతో తన అంచనా తప్పయిందని గుర్తించి, వెంటనే తన పాత చిత్రాలలోని సన్నివేశాలను ఏర్చి కూర్చి, "బాబీ" చిత్రంగా తీశాడు. గొప్ప హిట్ అయింది!

## ఆక్ట్ చేయకుండా నటించండి!

సహజంగా కాక ఏమాత్రం మోతాదు మించి నటించినా "మీరు ఆక్ట్ చేయకుండా నటించండి!" అని ఆర్టిస్టులకు తరచు సూచనిస్తుంటారు డైరెక్టర్ బాపు. ఈయన దర్శకత్వంలో వాణిశ్రీ శ్రీధర్‌లు నాయికా నాయకులుగా ముళ్ళపూడి వెంకటరమణ నిర్మించే "గోరంత దీపం" చిత్రం షూటింగ్ పూర్తయింది.

## అమితంగా ఆకర్షించిన అమ్మాయి

"నన్ను అమితంగా ఆకర్షించిన అమ్మాయి ఎవరో తెలుసాండీ? మద్రాసు టి. వి. కేంద్రం నించి తమిళంలో వార్తలు చదివే శోభనారవి అనే యువతి. ఆమె కనిపిస్తున్నంతసేపూ నేను మా టి. వి. సెట్ ముందునించి కదలనంటే నమ్మండి" అంది విజయలలిత. "అబ్బ! ఎంత అందంగా వుంటుందండీ ఆమె! అందానికి తగ్గ శ్రావ్యమైన కంఠం. ఆ కళ్ళల్లో ఎంత ఆకర్షణ వుందనుకున్నారు! వార్తలు చదవడానికి ముందు ఆమె వినమ్రంగా 'వణక్కం' అని ఒక చిరునవ్వు విసురుతుంది చూడండి. దాంతో నా ఒళ్ళు పులకరించినట్లవుతుంది. ఎంతో స్పష్టంగా చదువుతూంటే తమిళ భాష ఆమె నోట్లో కొత్త అందాలు సంతరించుకున్నట్లుంటుంది. న్యూస్ అయిపోయాక చివరనకూడా ఆమె మళ్ళీ ఒక చిరునవ్వు విసిరి అదృశ్యమైపోతుంది. ఆమె అలా యింకా కాస్సేపు నవ్వుతూంటే ఎంత బాగుణ్ణు, అనిపిస్తుంది" అంది విజయలలిత. [శోభనారవి బి.ఎ. పూర్తిచేసి, యిప్పుడు ఎం.ఎ. చదువుతోంది.]

## ఔట్ డోర్ షూటింగులు

కవితా ఆర్ట్స్ ప్రొడక్షన్స్ పతాకంలో కె. విశ్వనాథ్ దర్శకత్వంలో డి. వి. ఎస్. రాజు నిర్మిస్తున్న తాజా వర్ణ చిత్రానికి యిటీవల ఊటీలో జరిగిన ఔట్‌డోర్ షూటింగ్స్‌లో శోభన్‌బాబు, జయసుధ, అల్లు రామలింగయ్య, రావు గోపాలరావు పాల్గొన్నారు. మూడు పాటలు చిత్రీకరింపబడ్డాయి.

పద్మాలయా పిక్చర్స్ "పట్నవాసం" వర్ణ చిత్రానికి మంగళగిరి వద్ద తిరునాళ్ళ సందర్భంలో చిత్రీకరింపబడిన పాటలో కృష్ణ, విజయనిర్మల, శ్రీప్రియ మున్నగువారు పాల్గొన్నారు. 30 ఎడ్లబండ్లు కూడా పాల్గొన్నాయి. కృష్ణ సమర్పించే ఈ చిత్రానికి జి. హనుమంతరావు నిర్మాత, పి. సి. రెడ్డి దర్శకుడు.

---

### నేటి చిత్ర దర్శకులకు మార్గదర్శకుడు

## డాక్టర్ బి. ఎన్. రెడ్డి

### జీవిత విశేషాలు [16–11–1908 ★ 8–11–1977]

జననం : కడపజిల్లా, పులివెందుల తాలూకా, కొత్తపల్లి గ్రామం.

దర్శకత్వం వహించిన చిత్రాలు : వందేమాతరం (1939), సుమంగళి (1940), దేవత (1941), స్వర్గసీమ (1946), మల్లీశ్వరి (1951), బంగారుపాప (1955), భాగ్యరేఖ (1957), రాజమకుటం (1959), పూజాఫలం (1964), రంగులరాట్నం (1967), బంగారు పంజరం (1969).

బి. ఎన్. చిత్రాలకు లభించిన గౌరవాలు : మల్లీశ్వరి (చైనాలో జరిగిన తూర్పు ఆసియా చలన చిత్రోత్సవాలలో ప్రదర్శింపబడిన తొలి తెలుగు చిత్రం) బంగారు పాప (రాష్ట్రపతి రజత పతకం — 1955). భాగ్యరేఖ (రాష్ట్రపతి ప్రశంసా పత్రం 1957) రంగుల రాట్నం (రాష్ట్రపతి రజతపతకం 1967) ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ బంగారు నంది — ప్రథమ బహుమతి 1967) బంగారు పంజరం(రాష్ట్ర ప్రభుత్వ తృతీయ బహుమతి 1969).

బి. ఎన్. అలంకరించిన పదవులు : 1. ఆంధ్ర ప్రదేశ్ లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యులు (1958–63). 2. ఆంధ్ర సంగీత నాటక అకాడమీ సభ్యులు. 3. మద్రాసు సంగీత నాటక అకాడమీ సభ్యులు. 4. కాఫీ బోర్డు (బెంగళూరు) సభ్యులు. 5. కేంద్ర ప్రభుత్వ అవార్డ్సు కమిటీ సభ్యులు. 6. రాష్ట్రప్రభుత్వ అవార్డ్సు కమిటీ సభ్యులు. 7. పూనా ఫిలిమ్ ఇన్‌స్టిట్యూట్ సలహా సంఘ సభ్యులు. 8. మద్రాసు ఫిలిమ్ ఆక్టింగ్ స్కూల్ సలహా సంఘ సభ్యులు. ఆంధ్రప్రదేశ్ ఫిలిమ్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్‌కు చెందిన బాలల చలన చిత్ర నిర్మాణ సలహా సంఘానికి చెయిర్మన్, ఎఫ్. డి. సి. కి సలహాదారు.

ఘనతలు, సత్కారాలు : రాష్ట్రపతిచే "పద్మభూషణ్" బిరుదు ప్రధానం (1974) దాదాసాహెబ్ ఫాల్కే అవార్డు (1975) శ్రీ వెంకటేశ్వర, ఆంధ్ర విశ్వవిద్యాలయాలచే ఆనరరీ డాక్టరేట్ డిగ్రీ.

హలో!
నేనే మిస్టర్ బిజ్

BIZ
multipurpose
CLEANING POWDER
WITH SUPER DETERGENT



మిస్టర్ బిజ్ తెస్తారు
మిలమిల లాడే మెరుపు!
ఆ మెరుపు చూడాలనుందా?
మిస్టర్ బిజ్‌ను మీ వాడిని చేసుకోండి.
శక్తివంతమైన బిజ్ ఫార్ములా ఏమాత్రం
శ్రమ లేకుండా జిడ్డును, మురికిని
తుదముట్టించడాన్ని
స్వయంగా
గమనించండి.
ఇప్పుడు చూడండి,
మీ గాజు సామాను, పాత్రలు,
నేలలు, శానిటరీవేర్ (వాష్ బేసిన్
మొదలైనవి) ఇదివరకెన్నడూ
లేనంతగా ఎలా మెరుస్తున్నాయో!





మిస్టర్ బిజ్ ప్రతిసారీ
మీ డబ్బు ఆదా చేస్తారు!
అవును. మిస్టర్ బిజ్ ఒక్కరే
మీకివ్వగలరు 5-రీఫిల్ ప్యాక్. అందువల్ల
రీఫిల్‌కు రూ. 1/- చొప్పున మీకు ఆదా అవుతుంది.)
అంటే మీరు 5 రీఫిల్ ప్యాక్
కొన్నప్పుడల్లా మీకు రూ. 5/- ఆదా
అవుతుందన్న మాట. చూశారా,
ఎంత చక్కటి పొదుపో!

# బిజ్
## చక్కటి పొదుపు కోసం!

గోద్రెజ్ ఉత్పాదన

ASG5-107-234 TL

## ప్రమాదం తప్పించుకున్న ప్రధాన మంత్రి

ఢిల్లీనుంచి జోర్హాట్ ప్రధాని మొరార్జీ దేశాయిని మరికొంతమందిని తీసుకు వెళ్తున్న ఐ.ఏ.యఫ్. విమానం క్రిందకు దిగే సందర్భంలో ప్రమాదానికి గురి అయ్యిందట. మొరార్జీ విమానం లోంచి ఎగిరి గెంతేసి మూడు కిలోమీటర్లు పొలాల్లో నడిచి ఓ చిన్నపల్లె చేరారట క్షేమంగా. ఆ విమానంలోనే వున్న మొరార్జీ తనయుడు కాంతిలాల్ దేశాయ్‌కి కొంచెం గాయాలయ్యాయట.

## భార్య తలతో పోలీసు స్టేషన్‌కు వెళ్ళిన భర్త

క్రిష్ణగిరికి చెందిన తిరుపతి అనే కుర్రాడికి, 18 ఏళ్ళ చిన్నమ్మ అనే ఆమెకు నాలుగు నెలల క్రితం పెళ్ళయిందట. పెళ్ళయిన మర్నాటినుంచీ భర్తతో పోట్లాడుతూ చివరికి చిన్నమ్మ భర్తను వదిలి తల్లింటికి వెళ్ళిపోయిందట. అక్కడా పల్లెటూరిలో తమలపాకు వ్యాపారం చేస్తూ టోకున

# ఫాలాక్షుని డైరీ

కొనుక్కుపోడానికప్పుడప్పుడు కృష్ణగిరి వస్తూండేదట. క్రిష్ణగిరిలో ఆమెకు ఓ కుర్రాడితో పరిచయమయ్యినట్టు, వాడితో ప్రేమాయణం సాగిస్తున్నట్టూ తెలుసుకున్న తిరుపతి నాలుగు రోడ్ల మొగలో పట్ట పగలామె ఆ ప్రియునితో మాట్లాడుతూంటే గమ్మున మీదకురికి, సిగపట్టుకుని కొడవలితో ఆమె తల నరికి ఆ తల పుచ్చుకుని నేరుగా పోలీసు స్టేషనుకు వెళ్ళి సబ్ ఇనస్పెక్టరు టేబులుమీద పెట్టాడట. ఇతనికి చట్టం ఎనిమిదేళ్ళు శిక్ష విధించింది.

## ప్రాణాన్ని బలితీసుకొన్న నాటకం

కృష్ణగిరికి చెందిన 35 ఏళ్ళ చిన్నసామి అనే అతని భార్య అప్పుడప్పుడు అతనితో పోట్లాడి అదే వూరులో ఉన్న తన పుట్టింటికి వెళ్ళి పోతుండేదట. ఇది మాన్పించడానికి అతను నువ్వు తిరిగి వస్తావా, లేక ఉరేసుకు చావమంటావా అని కబురెట్టాడట. ఆ కబురుకామె రివ్వున తిరిగి వచ్చేసేసరికి తన నాటకం మరింత రక్తి కట్టాలని అతను దూలానికి వ్రేలాడగట్టిన తాడులో తల దూర్చి మరెప్పుడూ పోతానన్నవు కదా, చెప్పు లేకపోతే ఉరేసుకు చస్తానని అందులో తలదూర్చేడట. ఆ తొందర్లో కాళ్ళకిందనున్న కుర్చీ తిరగబడి, తాడు మెడకు బిగుసుకుని నరితానంగా ఆమె కళ్ళెదుటే విలవిలా తన్నుకు చనిపోయాడట.

## భార్య నెత్తిన కిరసిన్ పోసి అంటించినభర్త

నామక్కల్‌కు చెందిన ముత్తుసామి అనే అతనికి తన భార్య 25 ఏళ్ళ నీలమీద సందేహం వచ్చిందట. వారిరువురికి రెండేళ్ళ అమ్మాయి కూడా వున్నదట. భార్య ప్రవర్తన మీద అనుమానం పెరిగి పెరిగి ఆవేశం పట్టలేక ఆమె నెత్తిమీద నిసాడు కిరసనాయిలు పోసి గమ్మున నిప్పంటించేశాడట. నీల కెవ్వున కేకలువేస్తూ ఆ మంటలను ఆర్పేసుకున్నదట. అయినా ఆమె ఎడమ భుజము, గుండె బాగా కాలిపోయాయట. ముత్తుసామిని పోలీసులు అరెస్టుచేశారట.

---

9–12–1977 శుక్రవారం మొదలు
15–12–1977 గురువారం వరకు

# వారఫలం

మహేష్

**మేషం,—** ఉద్యోగంలో శ్రమ కలుగుతుంది. మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. రావలసిన డబ్బు అందుతుంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు :— కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. బంధు మిత్రులను కల్సుకొంటారు.

**వృషభం :—** మీ ఆలోచనలు ఫలిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం ఆఖరులో నూతన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు :— ఆరోగ్యం బాగుండదు. సాటివారిలో గౌరవం లభించగలదు.

**మిధునం :—** సాటివారితో మాటపట్టింపులు తగవు. వృత్తిలో శ్రమమీద అనుకూలత లభిస్తుంది. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. వారం ఆఖరులో శ్రమకు గురికాగలరు. స్త్రీలకు :— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**కర్కాటకం :—** వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. స్త్రీలకు :— ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**సింహం :—** మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. స్త్రీలకు :— దైవకార్యాలు నెరవేరతాయి. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**కన్య :—** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ఫలిస్తాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. స్త్రీలకు :— ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**తుల :—** ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. రావలసిన డబ్బు అందుతుంది. వృత్తిలో సాటివారిపోటీ తగ్గుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. స్త్రీలకు :— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

**వృశ్చికం :—** ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. మీ కార్యక్రమాలు బాగుంటాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు :— ఆరోగ్యం బాగుంటుంది. శుభ కార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**ధనుస్సు :—** వ్యతిరేకమైన వార్తలను వింటారు. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో వృత్తివ్యాపారాలు బాగుంటాయి. సాటివారిలో గౌరవం లభించగలదు. నూతన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు :— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

**మకరం :—** మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. వారంమధ్యలో చికాకులు యేర్పడతాయి. వృత్తిలో యెవరిని విశేషంగా నమ్మడం తగదు. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి. స్త్రీలకు :— ఆరోగ్యం బాగుండదు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**కుంభం :—** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. రావలసిన డబ్బు అందుతుంది. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. స్త్రీలకు :— కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. దైవ కార్యాలు నెరవేరతాయి.

**మీనం :—** అనుకూలమైన వార్తలను వింటారు. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. అన్ని వ్యవహారాల్లోనూ గౌరవం బాగుంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు :— ఆరోగ్యం బాగుంటుంది. బంధువుల వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి.

# కదలండి, ఆనందాన్ని ఆవిష్కరించుకోండి

Parry's

పైనాపిల్, ఆరెంజ్, లైమ్,
స్ట్రాబెర్రీ మరియు మాంగో
లిక్కరులు... మరెన్నో
ఆనందము కలిగించే వాటి
విందు కూడా!






®

మిఠాయిలు మరియు టాఫీలు

ప్యారిస్ కన్ఫెక్షనరీ లిమిటెడ్

PRS/2771 TEL

ఆ వాళల్లా యమ బీజీగా వున్నాడు గురుడు.

ఆరోజు వూళ్లోకి సినిమా వాళ్లు వచ్చారు!

అందువలన వూరంతా కోలాహలంగా వుంది. ఎండ తెగ మాడ్రేస్తూవున్నా దాన్ని ఎవరూ లెక్కచెయ్యలేదు గురుడు అసలు పేరు గురవయ్య. తోటివాళ్లందరూ 'గురూ' అంటారు. ఆ కారణంగా అతను గురుడయ్యాడు రోజల్లా గురుడి బండి పందెపు గుర్రంలాగ పరుగులు తీసింది. గురుడా ఎండనీ, శ్రమనీ లెక్కచెయ్యలేదు. వేసుకున్న చారల నిక్కరూ ఎన్టీవోడి షర్టూ చమటకి తడిసి పోతున్నా లెక్క చెయ్యలేదు.

గురుడు బండిని షోసరుకి అప్పచెప్పే సరికి గప్పున దీపాలు వెలిగేయి. శరీరం ఇంక శ్రమకి వోర్వలేనని ఎదురు తిరిగింది. పాత బాకీలు తీర్చమని గొణిగేడు గుమస్తా. జేబులోంచి బరువుగా వున్న చిల్లర తీసి లెక్కపెట్టేడు గురుడు చాలానే వుంది!

పాత బాకీలు, కొత్త మామూళ్ళు గుమాస్తాకి పారేసేడు.

గుమాస్తా కళ్ళు మెరిసేయి!

గుమాస్తా గురుడితో ప్రేమగా మంచీ చెడూ మాట్లాడేడు. పరధ్యానంగా అదంతా విని రెండో చెవితో వదిలేస్తూ మిగిలిన పైసలు లెక్క చూసుకున్నాడు గురుడు. పదిరూపాయలకి పైనేవుంది!

అంత సంపాదన ఈ మధ్యన కళ్లజూడ లేదు గురుడు.

ఇంటో రోగిష్టి ముసలి తల్లి వుంది. ఆమెకి మందులు కావాలి, భార్య రవికలు లేవని రోజూ గోలపెడుతుంది. దాన్ని తప్పకుండా తీర్చవలసిన కోరిక పుస్తకాలు లేవని బళ్లోంచి వెళ్ళగొడుతున్నారని గోల పెడ్తుంటాడు బుడ్డాడు. వాడి బాధ వాడిది. మనిషన్న తర్వాత అవసరాలు వుంటాయి. తనకీ ఎన్నో అవసరాలున్నాయి. వాట్ని తీర్చుకోవటాన్కి డబ్బులు లేకే కోరికల్ని అణగద్రొక్కాడిన్నాళ్లా గురుడు.

వూరుకి కళ వచ్చినట్లుంది. కొత్తగా, మునిసిపల్ గ్రవుండ్సులో సినిమా వాళ్ల మీటింగు వుందా రాత్రికి.

ఆ మీటింగుకనిజనం తండోప తండాలుగా వెళ్తున్నారు. ఆడ, మగ, ముసలి ముతక, పిల్లా జెల్లలందరి దారీ అటుగానే!స్టూడెంటు కుర్రాళ్ళ గురించి చెప్పనే అక్కరలేదు.

ఈ సందట్లో మిరపకాయల బజ్జీ దుకాణాల్నించి, కంపెనీల దాకా అన్నీ గిరాకీని సొమ్ము చేసుకుంటున్నాయి.

ఇంటిదారి పట్టాడు గురుడు.

"గురూ!"

వెనక్కి తిరిగి చూసాడు గురుడు.

అప్పలకొండ నవ్వుతూ వచ్చి భుజంమీద చేయి వేసాడు.

'ఇంటికేనా ?'

'ఆఁ'

'షోస్! అప్పుడేనా ? రా. కాంతమ్మ కొట్లో రెండు గళాసులు పట్టించి పోదాం' అంటూ ఆహ్వానించాడు అప్పలకొండ రావన్న గురుడ్ని బలవంతం చేసాడు. పగలల్లా కష్టం పడ్డామా! లేకపోతే ఆ శ్రమ ఎట్లా తీరుద్ది ?' అని ప్రశ్నించాడు.

కాదని అప్పలకొండని వదిలించుకొనేసరికి అరగంటయింది.

అందువలన బూతులు తిట్టి వెళ్ళిన అప్పల కొండని తల్చుకుని నవ్వుకున్నాడు గురుడు జనం తండోప తండాలుగా గ్రవుండ్సువేపు పోతున్నారు. కార్లు కీర్లు, ఆటోలు, రిక్షాలు. సైకిళ్ళు అన్నీ అటేపే సాగిపోతున్నాయి.

గోరీల దొడ్డి దగ్గర దీపాలు వెలగటం లేదు. చీకటిగా వుంది. ఆ చీకట్లోనే ఆడా మగా మనుషులు మసులుతూ వున్నారు

నడుస్తూవున్న గురుడి బుజంమీద చెయ్యి పడింది

'బ్రదర్! కాలేజి గర్లు వుంది కావాలా?'

గురుడు నవ్వుకున్నాడు. ఆ నవ్వును చూసి అవతలి మనిషి తెల్లమొహంవేసేడు. 'నిజం!' అని మనస్ఫూర్తిగా అన్నాడు, గురుడ్ని నమ్మించే ప్రయత్నంలో.

గురుడికి ఇంటి దగ్గర తనకోసంఎదురు చూస్తు వుండే భార్య జ్ఞాపకం వచ్చింది. దానికి పావలా మల్లెపూలన్నా తీసుకెళ్లాలని రోజూ అనుకుంటాడు గురుడు.

'రా. బ్రదర్' అంటు బలవంతం పెట్టేడు వాడు. అది వ్యాపారం!

'ఛీ.' అన్న గురుడి చీత్కారింపుకి, అసహ్యపడి వాడు అవతలకి వెళ్లాడు.

సెంటర్లో చిన్నారావు కనపడి గురుడ్ని పలకరించేడు.

సెంటర్లో గాంధీ గది వుంది. గాంధీ

చిన్నారావు ఫ్రెండు. ఆ గదిలో జోరుగా పేకాట సాగుతూ వుంటుంది.

'గాంధీగాడి గదికి వెళ్దామా?' అన్నాడు చిన్నారావు. గురుడు జేబు బరువుగా వున్న వైనమూ, గురుడు మెత్తబడని విషయం




గుర్తించి తెగ బలవంతం చేసేడు చిన్నారావుగాడు.

వాడ్ని విదిలించి, వదిలించుకుని ముందుకు సాగేడు గురుడు.

ముసల్దానికి మందులూ, ఇంటి దానికి రవిక గుడ్డలూ, కుర్రవాడికి పుస్తకాలూ కొనాలన్న కోరిక గురుడి మనసులో బలంగా వుంది.

అందుకే—

విసురుగా ఎడమవయిపుకి తిరిగి గబగబ నడిచాడు గురుడు. శరీరం శ్రమకి మవునంగా మూలుగుతో వుంది. కండరాలు తీపులు పెడుతున్నాయి. మనసు మూలల్లో పొంచి వుండిన కోరికలు తొంగిచూడడాన్కి ప్రయత్నిస్తున్నాయి. వాట్ని అణచి పెట్టటాన్కి ప్రయత్నిస్తూ ముందుకు సాగాడు గురుడు.

అంత దూరాన పాదరసం దీపాలతో ధగధగలాడుతూ వుంది స్టేడియంగ్రవుండు. ఆ గ్రవుండు చుట్టూరా ఇసకవేస్తే రాల నట్లు జనం నిండి వున్నారు. ఎత్తుగావున్న స్టేజి అలంకారాలతో కొత్త పెళ్లికూతురు లాగా వుంది. జనం ఆత్రంగా ఎదురు తెన్నెలు చూస్తు వున్నారు. సినిమా వాళ్లు ఇంకారాలేదు. రికార్డులు చెవులు గింగుర్లెత్తేలాగా మోగుతున్నాయి.

గురుడి జేబులో పైస లున్నాయి. అందువలన గురుడిప్పుడు సంఘన్నుడు. శ్రమ ఫలితమే సంపద. శ్రమ పడకుండానూ సంపదను పోగుచేసే పద్ధతులు ఈ వ్యవస్థలో వున్నాయి. ఆ పద్ధతుల్ని అందుకోవాలనే అందరూ ఆరాటపడేది. మెత్తగా జారిపోయి చేతులు మారిపోగల ద్రవ్యగుణం ద్రవ్యానికుంది. అకారణంగానే ఆ పద్ధతులు చలామణి అవగల్గుతున్నాయి;

నడుస్తువున్న గురుడు టక్కున ఆగిపోయాడు.

రోడ్డు ప్రక్కన, పెట్రొమాక్సు లయిటుతో, యవ్వనంలో అడుగిడిన చిన్నిపిల్లలాగ కన్పించింది గురుడికి ఆ కిళ్ళీదుకాణం. అక్కడ చాలా మంది మనుషులు గుమిగూడారు.

వాళ్లందరూ ఆత్రంగా దేనికోసమో ఎదురు చూస్తున్నారు. ఆ ప్రక్కనే చాలా రిక్షాలు నిలబడి వున్నాయి.

ఆ జనంలో ఒక మనిషి గురుడ్ని గుర్తించి ఇవతలికివచ్చాడు.

గురుడి గుండె దడదడ లాడింది.

నరాలు బిగదీసుకున్నాయి.

రక్తం చివ్వున పొంగి ప్రవహించింది.

మనసులో సంఘర్షణ చెలరేగింది. అనిశ్చితమయిన పరిస్థితి ఏర్పడి గందరగోళం సృష్టించింది.

సర్వశక్తులు కూడదీసుకొని గబగబ అడుగేసి దాటిపోవటాన్కి, తన దారిన తను సాగిపోవటాన్కి, ఇల్లు చేరుకోవడాన్కి ప్రయత్నించాడు గురుడు.

కాని అతని ప్రయత్నం వమ్మయింది.

అడుగు పడలేదు.

అంతలోనే—

ఆ మనిషి అంబునాథం గురుడ్ని సమీపించి చెయ్యి పట్టుకున్నాడు. గురుడి నవనాడులు కుంగిపోయేయి.

# ప్రశ్నావళి

**కె. రామలక్ష్మి**

కె. బి. ఎస్ — కురబలకోట

నూతన ప్రభుత్వం కూడా వచ్చేసింది...

ఆ అప్పుడే కొత్త సినిమాలాగా నూరు రోజుల పండుగ కూడా జరుపుకొంది !

జి. జి. ఆర్. సౌత్ మోపూరు

పాటి స్త్రీని చూసి అసూయ చెంది అపార్థాలకు దారి తీసే మీ స్త్రీ జాతి పై మీకింత మక్కువ ఎందుకు?

సాధించే ప్రతి స్త్రీ వెనుకా ఒక పురుషుడు వుండి తీరుతాడుకద! ఎప్పుడూ పెళ్ళాలని లోకువగా చూస్తూ పక్కింటి పెళ్ళాలని మెచ్చే మగవారిని చూడలేదా?! తవని కించపరిచినందుకూ, ఎదుటి ఆడదాన్ని ఆకాశానికెత్తుతూ మాట్లాడినందుకూ— ఫలితమే— సాధింపు, అసూయ అసహిష్ణుతనం, అల్ప బుద్ధి,. . అన్నీ.

వి. ఎస్. అల్వాన్‌పల్లి

ఈ రాకెట్ యుగంలో పురుషులకంటే స్త్రీలే ఎక్కువగా సినిమాలు చూస్తున్నారని తేలింది. అందుకే డొక్కు సినిమాలు కూడా శతదినోత్సవాలు చేసుకుంటున్నాయి. మీరిలా సినిమాల కెగబడితే సంసారం?

ఆ ప్రశ్న మీరు వేసుకోవాలి! అంత చెత్త సినిమాలో కూర్చునేనా సంసారం మరిచిపోదాం— నో మూడు గంటల పాటు అనిపిస్తుందనుకోవాలా ఆడవారికి! పొయ్యి లోంచి పెనం మీదికి కన్న మెరుగనిపిస్తుందేమో— స్త్రీలకి— నాకర్థంకాదు

ఎస్. వి. ఆర్. జె. కె. భీమవరం

మన పవిత్ర భారత దేశంలో స్త్రీ ఎలావుండాలి? చూడగానే గౌరవం ఉట్టిపడించేదిగా వుండాలి నాని నాగరికతా వ్యామోహంలో పడి. .

పడి — చూడగానే హేళన చేయాలనిపించేలా తయారయ్యారని కదా మీ బాధ. ఆడది కూడా వర్తమాన కాలంలో బ్రతుకుతుందన్నది మరిచిపోకండి. మీరంతా పవిత్ర భారత దేశపు గౌరవ పుత్రులు కారా? మీరు గతంలోనా బ్రతుకుతున్నారు?!

వెంకట్ ఉరవకొండ

మంత్రులకు ముఖ్యమంత్రులకు లేని వయో పరిమితి కేవలం ఉపాధ్యాయులకు ఉద్యోగస్తులకు మాత్రమే వర్తింపచేయడం ఏమిటి?

బాగా చెప్పారు అక్కడికి వయస్సు వచ్చిన మంత్రులకు మతి స్థిరం తప్పనట్లు. ఎసెంబ్లీలో ప్రతిపక్షాల తరపున ఏ సి వి కె రావుగారో — లేవనెత్తదగ్గ ప్రశ్నే యిది.

వి. ఎస్. అల్వాన్‌పల్లి

కొడుకు చెడిపోతే తండ్రి తప్పు. కూతురు చెడిపోతే తల్లి తప్పు తల్లి తండ్రు లిద్దరూ చెడిపోతే ఎవరి తప్పు?

ఎవరి తప్పు కాదు. పిల్లల రాత.

కె. ఏ. ఆర్. ఏలూరు

అసలు నవీనతకు ప్రాచీనతకు డెఫినిషన్ ఏమిటి

గడిచింది ప్రాచీనం. సాగేది నవీనం.

ఐ. జె. కాశీబుగ్గ

'మన దేశ జనాభాలో అధిక సంఖ్యాకులు మహిళలు. మరి పురుషునితో సమాన స్థితికి రాలేక పోరాడనికి చాలా మంది మహిళలు నిరక్షరాస్యులు కావడమేనని నా నమ్మకం.

నిరక్షరాస్యత కాదు. ఆత్మ గౌరవం లేకపోవడం పెద్ద కారణం.

వై. వి. ఎస్. విజయవాడ

పక్షపాత బుద్ధి మాని మర్యాదగా జవాబు లివ్వండి.

మర్యాదకి పక్షపాత బుద్ధి కి సంబంధమేమిటి? నేనెప్పుడూ కనీసపు మర్యాదలను అతిక్రమించి సమాధానాలు చెప్పనే— (అడిగే వాళ్ళు అలాంటి ప్రశ్నలు అడిగినా)

జి. ఎమ్. ఎస్. సింహాచలం

తల్లి తన మనసు లాంటిదే అందరిదీ అనుకుంటుంది?

అనుకుని వూరుకుంటే బాగానే వుంటుంది. అందరి మనస్సూ తన మనస్సులా తయారవ్వాలని అందరూ తన చుట్టూ తిరగాలని, తన మాట జవదాటకూడదని— అనుకుంటుంది. అందుకే తల్లి కాస్త అత్తగా రూపాంతరం చెందగానే— ఘర్షణ ప్రారంభం అవుతుంది.

ఎ. ఎస్. కె. సిద్ధాంతం

మా అక్క ఏ పుస్తకం ముట్టుకోదు. కాని ప్రశ్నావళి మాత్రం తప్పకుండా చదువుతుంది. దాన్లో ఏమైనా మందు వుందా చెప్పండి?

లేదు సోదరీ! మారే మందులు చాలా స్లో. నాది ఏటమిక్‌ఏజ్ వైద్యం. లేసర్ బీమ్‌లాగా మాటిగా వ్యాధిని కొడుతుంది.

'గురూ!' అంటూ పలకరించాడు అంబునాథం.

'ఇంకా ఫోను రాలేదు. మనవాళ్ళంతా రెండూ రెండూ ఖాయమంటున్నారు. వింటుంటే అంత కష్టేయ్యి. అదృష్టాన్ని అందుకో. రా' అంటూ దారితీసేడు. మంత్ర బద్ధుడిలాగ అతన్ననుసరించేడు గురుడు.

కొన్ని నిముషాల్లోనె— గురుడి జేబు ఖాళీ అయింది.

నలుగుర్తోపాటు ఫోనుకోసం నిరీక్షణలో పడిపోయాడు గురుడు. 'రావాలి. రావాలి' 'రెండూ రెండూ' అనుకుంటూ వుండిపోయాడు. ఆశతో— ఆశ తెచ్చిపెట్టిన వుషారుతో— వుత్సాహంగా వుండిపోయాడు. ఆ నిరీక్షణలో రెండు టీలు, ఒకపెట్టె చార్మినారు తగలేసేసరికి జేబు పూర్తిగా ఖాళీ అయిపోయింది.

## దారులు

'అయితే ఏమి? ఛాన్సు తగిలితే ఆ జేబు మరింతగా నిండటం ఎంతసేపు?!' అనుకుంటు వుండిపోయేడు గురుడు.

గ్రవుండ్సులో కలకలం చెలరేగింది. సినిమావాళ్ళు వచ్చి, స్టేజి ఎక్కారు.

జనం ఆనందంగా, ఆశ్చర్యంగా మంత్రముగ్ధులవలె వుండిపోయారు. అలాగ ఎంతోసేపు గడిచిన తర్వాత—

గొడవ మొదలయింది.

పోలీసులు లాఠీలతో జనంమీద పడ్డారు.

లైట్లు పోయేయి.

చూస్తు వుండగానె అంతా కంగాళీ అయింది నయనానందకరమయిన కలలాంటి దృశ్యం భీభత్సంగా అయింది. తొడతొక్కిడి తోపులాటా. వత్తిడిలో పెనుగులాటా. అరుపులు. ఆక్రందనలు.

అంతా అలా అయింతరువాత మరలా లైట్లు వచ్చేయి.

కుర్చీలు బల్లలు విరిగిపోయేయి.

స్టేజి చిందర వందరగా అయింది.

అంతవరకూ ఇసుకవేస్తే రాలనట్లు జనంతో నిండిన ఆ ప్రదేశం నిర్మానుష్యంగా వుంది. ఎప్పట్నించో ఆ దారినే వచ్చి అక్కడికి చేరిన జన సందోహం ప్రాణాలు అరచేత పట్టుకుని, భంగపాటుపడి ఎవరి దార్ల వెంట వారు పోపిక కొద్దీ పరుగులుతీసి పారిపోయారు.

నలుగురితోపాటు అటే చూస్తూవున్న గురుడు వులికిపడ్డాడు.

ఫోను గణగణ మ్రోగింది! అందరూ చెవులు రిక్కించి .ఫలితంకోసం చూసారు.

రెండూ — ఒకటీ.

ఛస్! ఒక్క నంబర్లో పోయింది అంటు చిందులు తొక్కాడు అంబునాథం. అంత

## చేసిన పరీక్షల వలన తేలింది...







# రుచికీ, విటమిన్లకూ, పుష్టికీ బిస్కట్ అంటేనే ఇది

బ్రిటానియా

# గ్లూకోజ్-డి



బ్రిటానియా గ్లూకోజ్-డి బిస్కట్లతో పాటు మరో ప్రముఖ బ్రాండ్ గ్లూకోజ్ బిస్కట్లను పోల్చి చూసేందుకు చేసిన పరీక్షల వలన తేలిందేమిటంటే: విటమిన్లు మరియు మొత్తం మీద పుష్టినిచ్చే పదార్థాలు గ్లూకోజ్-డిలో ఎక్కువగా ఉన్నాయని. అంతేగాక రుచికోసం, తియ్యదనం కోసం, కరకరలాడే తనానికి దీనివి కావాలంటారని. శక్తినిచ్చే విషయంలో, గ్లూకోజ్ కన్న గ్లూకోజ్ డి 20% ఎక్కువ శక్తినిస్తుంది! బ్రిటానియా గ్లూకోజ్-డి-తియ్యటి రుచితో కూడిన శక్తి!




అందుకే మరి ఏ ఇతర గ్లూకోజ్ బిస్కట్ కన్న బ్రిటానియా గ్లూకోజ్-డి అంటేనే ఎక్కువ మంది ఆకర్షితులవుతున్నారు.

బ్రిటానియా - బ్రిటానియా బిస్కట్లు అత్యుత్తమమైనవి

లింటాస్-B3C.GL-10-F40TL

## దారులు

వరకు ఆశగా ఉషారుగా, వోపిగ్గా ఎదురు చూసిన గురుడూ అందరో్తపాటు క్రుంగి పోయాడు.

శరీరం డస్సిపోయినట్లు నరాలు తీపులు పెడుతున్నట్లు అన్పించింది. కలల కడలిలో తేలిన ఆశలనావ మునిగిపోగానె భయంకర మైన వాస్తవం ఎదురయింది. కాళీ అయిన జేబు, బూడిదలో పోసిన కష్టార్జితం తలుపుకొచ్చింది. నీర్సంగా అడుగులువేస్తూ ఇంటిదారి పట్టాడు గురుడు.









# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

## బి. ఎన్. రెడ్డికి జోహార్లు

మద్రాసులో నవంబరు 8న కాలధర్మం చెందిన సుప్రసిద్ధ చలనచిత్ర దర్శక, నిర్మాత శ్రీ బి. ఎన్. రెడ్డి — బొమ్మిరెడ్డి నరసింహారెడ్డికి ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు, సమాచార వాణిజ్యశాఖ మంత్రి శ్రీ ఎం.మానిక్‌రావు, ప్రముఖ చలనచిత్రనటులు శ్రీ అక్కినేని నాగేశ్వరరావు ముమ్మగువారు సంతాపం తెలిపారు. 9వ తేదీన సాయంకాలం ప్రెస్‌క్లబ్‌లో సంతాపసభ జరిగింది. శ్రీ బి. ఎన్. రెడ్డి కడప జిల్లా పులివెందులలో 1908 నవంబర్ 16న జన్మించారు. వాహినీ సంస్థద్వారా పెక్కు కళాత్మక చిత్రాలు నిర్మించారు. స్వాతంత్ర్యానికి ముందే వందేమాతరం వంటి చిత్రాలు నిర్మించారు. మల్లీశ్వరి నాటికీ, నేటికీ అసమాన కళాఖండంగా మన్నన పొందింది. 1958 లో విధానపరిషత్తు సభ్యులుగా నామినేట్ అయ్యారు. 1974 లో పద్మభూషణ అవార్డు, 1945 ఫాల్కే అవార్డు పొందారు. బంగారుపాప, రంగులరాట్నం చిత్రాలు అవార్డులు పొందాయి. సంతాపసభకు అధ్యక్షత వహించిన శ్రీ ఆవుల సాంబశివరావు బి. ఎన్. రెడ్డి స్మారకార్థం కళాకారులకు ఏటా రాష్ట్రప్రభుత్వం షీల్డులు అవార్డులను ఇవ్వాలని సూచించారు. చిత్రాలకు రాశికంటే వాసి ప్రధానమని అన్నారు. శ్రీయుతులు అక్కినేని, సి. పుల్లయ్య, యు. విశ్వేశ్వరరావు, వాణిశ్రీ, కె. వి. చలం, సి. నారాయణరెడ్డి, జి. ఎన్. వరదాచారి, కిషన్, బి. వి. రెడ్డి, బి. ఎన్. రెడ్డి ప్రతిభను ప్రశంసించారు.

## రాజకీయాలలో కొత్త మలుపు

రాష్ట్రవిధాన సభల ఎన్నికలు సమీపిస్తున్న కొద్దీ రాజకీయాల గతి కూడ మారుతున్నది. ఉత్తరప్రదేశ్ మాజీగవర్నర్ డాక్టర్ చెన్నారెడ్డి, ప్రముఖులతో చర్చలు జరుపుతున్నారు. కాంగ్రెస్‌కూ, జనతాకు విడిగా మూడవపార్టీ ఏర్పాటుకు చెన్నారెడ్డి సుముఖంగాలేరు. ప్రత్యేక తెలంగాణాకు ఇది సమయంకాదని ఆయన స్పష్టపరిచారు. కర్నాటక ముఖ్యమంత్రి అరసు, చెన్నారెడ్డి మంతనాలు జరిపారు. ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావుకు, కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ బ్రహ్మానంద రెడ్డికి మధ్య కుదిరిన అపవిత్రమైన పొత్తు కాంగ్రెస్ సంస్థను దిగజార్చిందని, అందువల్ల ప్రజాస్వామ్య రీతిలో కాంగ్రెస్‌లో పనిచేయడానికి పలువురు కాంగ్రెస్ వాదులకు అవకాశం లేకపోయిందని చెన్నారెడ్డి వివరించారు. ఇదిఇలా వుండగా జనతా, మార్క్సిస్టులతో ఉగ్రవాదులు ఎన్నికల పొత్తుకు సిద్ధపడుతున్నారు. కేంద్రంలో జనతా ప్రభుత్వం పరిపాలనాతీరు పై అభిప్రాయ భేదం వున్నప్పటికీ, రాష్ట్రంలో వెంగళరావు పాపిష్టి పరిపాలన అంతం కావడానికి ఎన్నికల సర్దుబాటుకు సిద్ధమవుతున్నామని ఉగ్రవాది నాయకుడు శ్రీ కొండపల్లి నారాయణస్వామి ప్రకటించాడు. జనతా పార్టీ విపులంగా సన్నాహాలు చేస్తున్నది. వెంగళరావు మంత్రివర్గంపట్ల భ్రమలు పోయాయని, రాష్ట్ర అధ్యక్షుడు శ్రీ తెన్నేటి, లక్ష్మీకాంతమ్మ నవంబర్ 13న ఢిల్లీలో జరిగిన జనతాపార్టీ దక్షిణమండల ఎన్నికల ప్రచారసంఘం సమీక్షా సమావేశంలో వివరించారు. రాజ్యసభ సభ్యుడు శ్రీ ఎం. ఆర్. కృష్ణ జనతా పార్లమెంటరీపార్టీ సభ్యుడయ్యాడు. రాష్ట్రంలో ఇందిరావర్గం వారు అవసరమయితే కాంగ్రెస్‌నుండి పోవడానికి కూడా ఆలోచిస్తున్నారు. ఇప్పుడు కాంగ్రెస్‌లో ఏర్పడిన చీలికలు సమసి, రాజీ ఏర్పడి, బ్రహ్మానందరెడ్డిదే పైచేయి అయ్యేపక్షంలో తిరుగుబాటు మంత్రులు రెడ్డి వ్యతిరేక వర్గంలో చేరదలచారు. కాని, బ్రహ్మానందరెడ్డి మాత్రం విధాన సభల ఎన్నికలకు కాంగ్రెస్‌పార్టీని సమాయత్తపరచవలసిందిగా పార్టీ కార్యదర్శులకు ఆదేశాలిచ్చారు. ఎన్నికలు జరుగబోతున్న ఆరు రాష్ట్రాలలోను రాష్ట్రపతిపరిపాలన విధించబడుతుందంటూ ఢిల్లీలో వదంతులు వ్యాపించాయి.

## ఉమాభారతికి సన్మానం

మలేషియాలో జరుగనున్న ప్రపంచ తెలుగు మహాసభ నిధుల సేకరణకై మలేషియాలో 13 నాట్య ప్రదర్శనలు జరిపివచ్చిన ప్రముఖ నర్తకి ఉమాభారతికి, ఆమె బృందానికి అంతర్జాతీయ తెలుగుసంస్థ ఆధ్వర్యంలో జరిగిన సన్మానానికి విద్యాశాఖామంత్రి శ్రీ మండలి కృష్ణారావు అధ్యక్షత వహించారు. మలేషియా, సింగపూర్‌లలో నెలరోజులు ఈ బృందం పర్యటించింది. ఈ విషయాలు ఉమాభారతి తండ్రి శ్రీ ఎ. సత్యనారాయణ వివరించారు. అక్కడివారు అందించిన ప్రశంసాపత్రాలు వినిపించారు.

## ఎక్‌బాల్ శతజయంతి

రాష్ట్రగవర్నర్ శ్రీమతి శారదాముఖర్జీ నవంబర్ 11వ తేదీన ఎక్‌బాల్ శతజయంత్యుత్సవాలను ప్రారంభిస్తూ, ఎక్‌బాల్ మహోన్నతవ్యక్తి అన్నారు. సభకు ఉస్మానియా విశ్వవిద్యాలయం వైస్‌చాన్సలర్ ప్రొఫెసర్ జి. రామ్‌రెడ్డి అధ్యక్షత వహించారు. ప్రత్యేక సంచికను న్యాయశాఖామంత్రి శ్రీ ఆసిఫ్‌పాషా ఆవిష్కరించారు. ఎక్‌బాల్ అకాడమీ ఈ ఉత్సవాలు ఏర్పాటు చేసింది.

## ఉపశ్రుతి

—ఏమిటండీ ఎన్నికలు దగ్గరవుతున్న కొద్దీ పార్టీల పొత్తులు విచిత్రంగాజరుగుతున్నాయే— అని అడిగాను. ఒక వృద్ధ రాజకీయనేత అన్నారుగదా, —మీకు తెలియనిదేముందండీ. వ్యాసుడు చెప్పనే చెప్పాడు.

> యథా కాష్ఠంచ కాష్ఠంచ
> సమేయాతాం మహోదధౌ,
> సమేత్యచ వ్యపేయాతాం
> తద్వజ్జీవ సమాగమః

సముద్రంలో కొట్టుకు వచ్చిన కర్రలు కలుస్తాయి, విడిపోతాయి. అలానే సంసారంలో జీవులు, సంసారంలో వేగా రాజకీయ పక్షాలు. అవీ అంతే అవసరాన్ని బట్టి కలుస్తాయి, విడిపోతాయి—అని. ★



## జీవనపోరాటంలో...

(18వ పేజీ తరువాయి)

రెండేళ్ల సహచర్యంలోనూ మొదటి సారిగా శంకరరావుగారు రాధ, రాజులతో పాటు భానునికూడా వెంటబెట్టుకు సినిమాకి తీసుకు వెళ్ళారు.

### 18

వేసవి శలవల్లో ఒకరోజున, హఠాత్తుగా వచ్చిన కౌసల్యనీ, పిల్లలనీ చూసి ఆశ్చర్య పోయింది మహాలక్ష్మమ్మ.

"రండి. రండి. ఉత్తరమయినా రాశారుకారేం ?" అంటూ ఆహ్వానించింది.

"మా ఆడపడుచు కొడుకు పెళ్లి జరిగింది మొన్ననే. ఆయనా, మేమూ కలిసే వచ్చాం. ఆయనకి శలవులేదంటూ వెళ్లిపోయారు. ఎలాగూ పిల్లలకి శలవులే కదా, అన్నయ్యని చూసినట్టూ వుంటుందని యిలా వచ్చాం మేము." అంది కౌసల్య. ఆమెని చూసి మహా సంతోషపడ్డాడు సాంబయ్యగారు. అయిదారోజులున్నారు వాళ్లు.

రాధకీ, రాజుకీ బాబు తోడురాగా, తీసుకు వెళ్లి వూరూ, చేలూ చూపించాడు భాను. రజనికి, రాధకీ మంచి స్నేహం కుదిరిందీ యీసారి. పోయినసారీ వారం రోజులున్నా, అప్పుడెవరి మనసుల్లోనూ ఉత్సాహంలేదు. ఎవరిదోవన వాళ్లుండి పోయారు. ఈసారి పిల్లలంతా కలిసి తిరుగుతుంటే కన్నులపండు గయింది పెద్దవాళ్లకి. రాధని మహాలక్ష్మమ్మ 'ఏమే కోడలా' అంటూ పిలుస్తుంటే కౌసల్యకి సరదాగానే అనిపించింది.

భానుని అల్లునిగా చేసుకోవాలన్న కోరిక ఆమెకీ మనసులో వుంది. అయితే ఇన్నాళ్ళూ ఆ ఆలోచన భర్తదగ్గర బయట పెట్టటాని కామె భయపడింది. కారణం భాను ప్రవర్తన.

ఇప్పుడా భయం లేదు. భర్త అంగీక రిస్తాడనే అనుకుంది ఆమె.

పొద్దున్నే భానూ, బాబూ కలిసి పొలానికి వెళ్లేవాళ్లు. మధ్యాహ్నం వాళ్ళకి అన్నం తీసుకుని వెళ్లే రజనితోపాటుగా రాధ కూడా వెళ్లేది.

పాంటూ, షర్టూ వేసుకు కాలేజీకి వెళ్లే భాను, పంచెకట్టి, బనీనయినా లేకుండా పొలంపని చేస్తుంటే వింతగానూ, తమాషా గానూ అనిపించింది రాధకి.



# మనోజ్ఞమైన రూపకల్పన

నీలి, ఆకుపచ్చ, గ్రే, నలుపు, బ్రౌన్ మరియు బెయిజ్ రంగులు ఎవరూ, ఎప్పుడూ, ఎక్కడా సమర్పించని విస్తృత శ్రేణిలో!

కాటన్ బట్టలలో పాప్లిన్స్, కేంబ్రిక్స్, సాటిన్స్, డ్రిల్స్, గేబర్డిన్స్...ఇంకా పోలియెస్టర్ మిశ్రిత సూటింగులు మరియు షర్టింగులు.



# మధురా బట్టలు

తయారుచేయువారు :

# మధురా కోట్స్

డీలర్లు :

మధురా సౌత్ ఇండియా కార్పొరేషన్. (ప్రై.) లిమిటెడ్, 156, వస్త్రలత, విజయవాడ 520 001. మధురా సౌత్ ఇండియా కార్పొరేషన్ (ప్రై.) లిమిటెడ్, 3-4-191, బళ్ళారి బిల్డింగ్, 1వ ఫ్లోర్, హోల్‌సేల్ క్లాత్ మార్కెట్, సికింద్రాబాద్ 500 003. శ్రీ లక్ష్మి టెక్స్‌టైల్స్, బెసెంట్ రోడ్, గవర్నర్‌పేట, విజయవాడ 520 002.

# తలనొప్పా? అయితే తీసుకోండి ఒక గ్లాసెడు నీళ్లు






మరియు ఒకే ఒక సారిడన్

SP. 2158




---

## జీవితపర్యంతం మీరు వాడుకోగల సైకిల్ ల్యాంప్‌ను కొనుక్కునేందుకు మూడు నిమిషాలను వెచ్చించండి.



**మొదటి నిమిషం:**
కిరసిన్ ల్యాంప్‌తో చాలా శ్రమపడ వలసివుంది. కష్టమైన నిర్వహణ. ఆరిపోగలదు. బాగా గాలి వీచినా, వర్షం కురిసినా యీ ల్యాంప్ నిరుపయోగమైనది. పైగా వెలుతురును స్వల్పంగానే యివ్వగలదు.

**రెండవ నిమిషం:**
బ్యాటరీ ల్యాంపో? మరి దీనిని కొంటే తర్వాత బ్యాటరీ సెల్లులను కొనేందుకై వ్యయం చేయాలిగదా. అదీకాక, ఎవరైనా దీనిని సులభంగా దొంగిలించుకు పోవచ్చు

**మూడవ నిమిషం:**
మరి కర్తవ్యం? వెలుతురును ప్రకాశవంతంగా చేకూర్చగల, దొంగిలించుటకు సులభసాధ్యం కాని, అందమైన మిల్లర్ డైనమో ల్యాంప్ సెట్‌నే కొనుక్కోండి. ఇది జీవిత పర్యంతం చక్కగా పనిచేయగలదు.

6 లేక 12 వోల్టుల ల్యాంప్‌సెట్‌లలో మీకు నచ్చిన దానిని ఎన్నుకోండి.






**మిల్లర్ డైనమో ల్యాంప్ సెట్ వెలుగును యిచ్చి దారిని చూపిస్తుంది**




టిఐ మిల్లర్ లిమిటెడ్, మద్రాసు

ట్యూబ్ ఇన్‌వెస్ట్‌మెంట్స్ ఆఫ్ ఇండియా లిమిటెడ్‌వారి ఒక ఉప సంస్థ

SDS TIM 2507 TELR

## జీవనపోరాటంలో...

"బావుంది భానూ, నీ ద్విపాత్రాభినయం" అంది నవ్వుతూ, ఓ సారి.

"బతుకు సవ్యంగా గడవాలంటే ఎన్ని వేషాలయినా వెయ్యక తప్పదుగా మరి" అన్నాడు నురి.

"వెర్రి వేషాలు కూడానా?" అందిరాధ.

చటుక్కున భాను ముఖం ముడుచుకు పోయింది ఆ మాటతో.

"నవ్వుతూ అన్నాన్లే భానూ, అంతలోకే కోపమా?" అంటూ అతడి కోపం పోగొట్టింది ఆమె.

దాదాపు వారం రోజుల తరువాత వాళ్ళు వెళ్ళిపోతుంటే, యింటిల్లిపాదీ బాధపడ్డారు.

### 19

తిరిగి కాలేజీలు తెరిచారు. హాస్టల్‌కి వచ్చేశాడు భాను. 'ఫైనలియర్! ఈఒక్క సంవత్సరం కష్టపడితే చాలు' అనుకున్నాడు.

రఘురాంకి ఫస్ట్‌క్లాస్ వచ్చింది, అతడు మార్కులు తీసుకోవడానికి వచ్చి భాను గదిలోనే రెండు రోజులున్నాడు. అతను వెళ్ళిపోతుంటే కళ్లనీళ్ళ పర్యంతం అయింది భానుకి.

"నా ప్రవర్తన ఎలా వున్నా, గత రెండేళ్ళుగా చాలా ఓర్పుతో, ఒక అన్నయ్యలాగా భరించావు రఘూ! వెళ్ళిపోతున్నావంటే నాకు చాలా బాధగావుంది. నీకు త్వరలోనే మంచి ఉద్యోగం రావాలని ఆ భగవంతుణ్ణి మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను. ఉత్తరాలు రాస్తుంటావుగా!" అన్నాడు.

"తప్పకుండా రాస్తాన్నా! ఇప్పుడిహ నీకు జాగ్రత్తగా చదువుకోమని చెప్పనవసరంలేదులే!"

నవ్వుతూ అతని భుజంతట్టాడు రఘు. ఆ నవ్వులోనూ వెలితివుంది.

స్టేషన్‌దాకా వెళ్ళి, అతడిని రైలు ఎక్కించి, బరువెక్కిన హృదయంతో తిరిగి వచ్చాడు భాను.

* * *

రోజులు మామూలుగా గడిచిపోతున్నాయి. తీరిక దొరకనంతగా చదువులో మునిగిపోయాడు భాను. ఏ రోజూ మానకుండా క్లాసులకి వెళ్ళినట్టే లేబరేటరీలకీ, వర్క్‌షాపులకీ వెళ్తున్నాను. సెషనల్ వర్క్‌లోనూ అంతే రెగ్యులర్‌గావుండాలంటే ఫైనలియరో తీరిక చిక్కటం కష్టమే మరి! అయినా కష్టపడుతున్నాడు.

కాలేజీలో పరిస్థితులు బాగానే వున్నా— యింటిదగ్గరనుంచి వచ్చే ఉత్తరాలు అతణ్ణి వ్యాకుల పెడుతున్నాయి. సాంబయ్యగారి ఆరోగ్యం ఏమీ బాగుండటంలేదు ఏడాదినించీ మంచం పట్టటంతో మనిషి దైహికం

# సైతాన్ తుఫాన్ దండయాత్ర

(20వ పేజీ తరువాయి)

విసిరి పారేసింది— ఐతే వాడపాలెం, కొత్త మాజేరుల మధ్య ప్రాంతం ఒక ఐదారు మైళ్ళ దూరం దాటాక మోపిదేవి దాకా తుఫాన్ తాకిడి తగిలింది—చెట్లూ, విద్యుత్ స్తంభాలు కూలిపోయాయి— శవాలు చెత్తా చెదారాలు లేవు— తిరిగి రెండవ దెబ్బగా మోపిదేవి నుంచి అవనిగడ్డ దాకా ఉప్పెన ధాటి కానవచ్చింది! ఈ ఉప్పెన వింతగా వుంది. స్థానికులు సముద్రంలో హంసలదీవి ప్రాంతంలో మండినట్లుందన్నారు.

ఉప్పెన 'నాకిన' చెట్లూ చేమల ఆకులన్నీ మాడిపోయి వున్నాయి — శవాలమీద వాతలు కూడా వున్నాయంటారు తీర గ్రామవాసులు!—

మూడవ "కాటు" అవనిగడ్డ భావదేవరపల్లి మధ్య 5నుంచి ఆరుమైళ్ల మేర పడ్డది.

ఇదీ దివిసీమగా మారిన దివిసీమ స్థితి!

### తుఫాను జైత్ర యాత్ర

బంగాళాఖాతంలో 17 నవంబర్న ప్రారంభమైన తుఫాన్ పెనుతుఫాన్‌గా మారి ఉత్తరంగా ప్రయాణం చేసి చీరాల ప్రాంతాన తీరమెక్కి అడ్డూ అపూ తెరిపీ లేకుండా పది పన్నెండు గంటలు బాపట్ల తెనాలి, గుంటూరు, విజయవాడ లాంటి పట్టణాలనుకూడా చావబాదేసింది — 20 తెల్లారుగట్ల— బందరు సముద్రంలో ఉప్పెనతో ఎదురుగా పోరి— ఆగిపోయింది—

ఈ రెండింటి రాపిడి మధ్య పచ్చని తెలుగు నేల రుద్రభూమి ఐంది— చిన్నచిన్న పరిశ్రమలు జలగండాన పడ్డాయి—

చర్చిల్లో, దేవాలయాల్లో స్కూళ్ళల్లో తల దాచుకున్న వాళ్లను కూడా 'సైతాన్' తుఫాన్ వదలకుండా చంపింది మహానగరం గుంటూరులో అయిదారు వందల పేద జనాన్ని భోజనం చేసింది— నల్లచెరువు అనే పేదవాడ పేరుని సార్థకం చేస్తూ శాశ్వతంగా మృత్యు తటాకంగా మార్చింది!

### సినిమాల్నాయి!

విచిత్రంగా తోచిన దేమిటంటే— యీ పర్యటనలో పాతిక లక్షల మంది— అయోమయ స్థితిలో దిక్కు తోచక అల్లాడుతూ వుంటే జనరేటర్‌లమీద నడిచే బయిస్కోపులకు రద్దీగా వుండటం!

ఈ జెనరేటర్‌లు మంచినీటి సరఫరాకి, ఆసుపత్రులకి ఎందుకు పోలేదూ అన్నదే సామాన్యుని సణుగుడు! రాష్ట్రపతి నుంచి రాదారి వూడ్చే ప్రజాసేవకునిదాకా అందరూ యీ దీన ప్రజానీకాన్ని పరామర్శించవస్తున్న దశలో యిది రాస్తున్నాను — అమెరికా అధ్యక్షుడు కార్టర్ నుంచి బ్రిటిష్ రాణి దాకా యీ ఘోర విపత్తుకి చలించిపోయారు. కోట్లకొలది నష్టాన్ని భర్తీ చేయలేరుకాని ఎన్ని కోట్ల రూపాయలైనా వెచ్చించి కోటిమందిని తాకిన యీ అఘాతపు గాయాన్ని మాన్పడానికి అందరూ కృషి చేయాలి! ఇది వెంటవెంటనే జరుగాలి విద్యుత్ స్తంభాల లెక్క, పీనుగుల లెంకె కాదు వాటిని టకటకా లేపడం, వెలుతురివ్వడం— వీటిని దహనం చేసి బతికున్నవారికి బతుకుమీద తీపి కలిగించటం — హైదరాబాదు, ఢిల్లీల కర్తవ్యం — మనందరి బాధ్యత. కాదుకాదు మన మనుగడ కోసం మన అవసరం—ప్రకృతి వైపరీత్యాన్ని అడ్డలేముగాని దాన్ని తట్టుకొని లేచి నిలబడటం ఆధునిక మానవుని స్థైర్యానికి, ధైర్యానికి నిదర్శనం. ఈ తుఫాన్ యీ ఉప్పెన కురుపాండవులవంటి వర్గాలను కూడా ఏకంచేసి ఆంధ్రభూమిని ఆవరించిన అంధకారాన్ని త్వరగా తొలగించగలదని ఆశించడం అందుకు పూనుకోడం — గుండెలు బాదుకొంటూ ఆక్రోశించడంకన్నా ముఖ్యం — శ్మశాన వైరాగ్యమంతటా ఆవరించిన యీ దశలో ఒకరి కన్నీరు ఒకరు ఒత్తుకోవ! అంతేనురి...

*[వీరాజీ 23 11 77]*

# జీవనపోరాటంలో...

గా నేకాక, మానసికంగ కూడా బాగా సీర సించిపోయారు. ఈ మధ్య బ్లడ్ ప్రెషర్ కూడా ఎక్కువయింది. ఇదివరకు పొదుపుగా, నోరు మెదపకుండా తిరిగిన వ్యక్తి, యిప్పుడు చీటికీ, మాటికీ కోపం తెచ్చుకోవటం, చిరాకు పడటం చేస్తున్నారు తప్పనిసరి అయినా — కూర్చుని ప్రతిపనీ చేయించుకోవటం ఆయన్ని ప్రాణసంకటంగా వేధిస్తోంది. ఆ చిరాకు ఆయన నోరు విప్పినప్పుడల్లా చుట్టుపక్కల వాళ్ళమీద ప్రదర్శిస్తున్నారు

ఇవన్నీ చదువుతుంటే భాను మనసు నీరయిపోతోంది

'ఏమిటిది? ఎన్నాళ్ళలా? ఎప్పటికాయన బాగుపడతారు? ఎప్పుడు తాము పూర్వంలా సంతోషంగా వుండగలరు?'

ఇది ఒకరకం బాధ అయితే, మరోరకం చికాకులు పొలం గురించీ, పంట గురించీ!

ఆయన చేతిలో డబ్బు తక్కువయిపోయింది— విపరీతంగా పెరిగిన ఖర్చు మూలాన! పొలానికి కావల్సిన ఎరువులూ, యితర ఖర్చులకి డబ్బు సర్దుబాటు కాకపోవటమూ ఆయనకి చింతే! నెల నెలా భానుకి పంపవల్సినది వుండనే వుంది!

మొత్తంమీద బండి ఏదో ఒక విధంగా నడచిపోతున్నా ఆయన మానసికాందోళన మాత్రం తగ్గటం లేదు.

భానుకి యివన్నీ ఆలోచిస్తుంటే, ఒక వైపు చదువు సాగటంలేదు. మరోవైపు ఎంత వేగం ఈచదువు ముగించుకు బయటపడదామా— అనిపిస్తోంది. చదువుపూర్తయి వెళ్ళిపోతే, ఉద్యోగం రావటం సంపాదన మాట ఎలా వున్నా, ముందీ ఫీజులూ, ఖర్చులూ తప్పుతాయి కదా!

* * *

భాను యీ మధ్య మరీ దిగులుగా, ఏదో ఆలోచిస్తున్నట్లుగా కనిపించటం రాధకి బాధగా అనిపిస్తోంది

'ఇదివరకు ఎంత రెక్లెస్‌గా వుండేవాడు. ఎప్పుడు నోరు విప్పినా సినిమాలు, ఆటలు, కాలేజీ అల్లర్లు యివి తప్ప వుండేవి కాదు. ఇప్పుడసలు ఎక్కువ మాట్లాడటమే లేదు. మాట్లాడినా చదువు గురించీ, యింటి గురించీ, తండ్రి ఆరోగ్యం గురించీ!

విచిత్రమల్లా- యిదివరకల్లా అతడి కబుర్లు చిరాకుని, అసహ్యాన్నీ కలిగించేవి రాధకి ఎప్పుడూ జులాయిగా తిరిగే యీ మనిషికి బుద్ధి వుందా? అనిపించేది.

ఇప్పుడతను మాట్లాడుతుంటే, 'ఇంత చిన్న వయసులోనే యిన్ని దిగుళ్ళా—బాధలూనా? సరదా అనేది యీ మనిషి మర్చిపోయాడా పూర్తిగా?' అనిపిస్తోంది.

అన్నిటికన్న చెప్పుకోదగ్గ విశేషం — అసలామె భానుని గురించి అంతగా ఆలోచించటం !

ఇదివరకు అతని ఆలోచన వస్తేనే చిరాకుపడేది ఇప్పుడు తరుచు అతడి గురించిన ఆలోచనల్లోనే, అతడి మీది సానుభూతితోనే మనసు నిండిపోతోంది !

తనపట్ల రాధ ధోరణిలో వస్తున్న మార్పుల్ని భాను గమనిస్తూనే వున్నాడు. ఇదివరకైతే అతను అందుకు సంతోషించేవాడే కాని, యిప్పుడా విషయం అతనికి తెలుస్తున్నా, మనసు దాకా వెళ్ళి అంతరాన్ని తాకటంలేదు

ఆమె ఒకప్పుడనుట్లుగా యిప్పుడతను 'తన' గురించి మర్చిపోయే ప్రయత్నంలో వున్నాడు ఎంత సేపూ చదువు మీదా బాధ్యతల మీదే ధ్యాస!

## 20

ఆ ఏడు దీపావళి చీకట్లు పారద్రోలుతూ రాలేదు ప్రజల్ని చీకట్లలో ముంచెత్తుతూ వచ్చింది !



ఆ మధ్య హైదరాబాదులో రంగ ప్రవేశ నాట్యోత్సవం జరుపుకున్న కుమారి దిగుమర్తి జానకీదేవి ఇంటర్మీడియేట్ చదువుకుంటున్న విద్యార్థిని. ఈమె తొలి ప్రదర్శన అందరి ఆదరణ, ప్రశంస చూరగొన్నది.



అమావాస్య మరో నాలుగు రోజులుం డనగానే, బంగాళా ఖాతంలో వాయుగుండం పడిందన్నారు—తుఫాను చెలరేగింది ! ఆంధ్ర దేశ మంతటా ముసురు పట్టింది. ముసురు

## జీవనపోరాటంలో...

క్రమంగా తుఫానుగా మారింది. మరునాడు చతుర్దశి అనగా కుంభవృష్టి మొదలయింది.












తుఫాను గాలులు ఏళ్ల తరబడి పాతుకు పోయిన మహావృక్షాలూ, సరుగుడు చెట్లూ కూడా నేల కూలేలా—వీచసాగాయి.

తుఫాను మొదలైన రోజు మధ్యాహ్నానికే కరంటు స్తంభాలు కూలి పడిపోయాయి. విద్యుత్ప్రసారం లేదు—ఎక్కడా !

ఆ మధ్యాహ్నం హాస్టల్లో నందడి చూసి తీరాలి !

చుట్టుపక్కల కొబ్బరి తోటలూ, అరటి తోటలూ కూలి ధ్వంసమై పోయాయి ఉదయంనించీ.

మధ్యాహ్నం గాలి విసురు కొన్త తగ్గ టంతో, విద్యార్థులు బయటికి వచ్చారు. కూలి పోయిన తోటలు వాళ్లకి కనుల విందుగా తోచాయి! కిష్కింధా వాసుల్లా ఉత్సాహంగా, ఎవరికందినన్ని కొబ్బరికాయలూ, అరటి గెలలూ వాళ్ళు మోసి తెచ్చుకున్నారు! గది గదికీ తిరిగి పంచుకున్నారు. వాటితో విందు చేసుకున్నారు! (ఇంకా వుంది)


Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna



విమల్ సూటింగ్స్‌లో రంగుల వైభవం,
డిజైన్ల సందోహం.
మీకు నచ్చేది తెలుపు రంగైతే, మీ శ్రీమతికి
గచ్చకాయ రంగు ఇష్టమేమో మరి.
ప్రతి ఏడాది మేము తయారుచేసే 10,800 డిజైన్ల,
రంగుల కలయికలలో, మీకు నచ్చేవి,
మీ శ్రీమతి మెచ్చేవి కోకొల్లలు.




సూటింగ్స్